శ్రీ

# సతీ సక్కుబాయి

(ఐదంకముల స్వతంత్ర నాటకము)

ఇది

స్వరాజ్యరథము, రంగూన్ రౌడీ, సతీ అనసూయ, గంగావతరణము, ధరశశికోట,
భక్తవిజయము, కాలకేతనము, తాజ్ మహాల్, భోజకాళిదాసు,
మున్నగు ననేక స్వతంత్ర నాటకములను;
శిశుహత్య, వనదుర్గము, తపోవనము, జపమాలిక, రక్తజ్వాల
మున్నగు ననేక స్వతంత్ర నవలలను
రచించి ప్రఖ్యాతి వహించిన
దేశముఖు, దేశపాండ్యా,

సోమరాజు రామానుజరావుగారిచే

రచియింపఁబడినది

---

పంచమ ముద్రణము 000 ప్రతులు.

---

పబ్లిషరు:

కురుకూరి సుబ్బారావు సన్స్,

ప్రొప్రయిటరు

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

బాలప్రభా ప్రెస్, బాబీనగర్, గుణదల.

1952

 [వెల 1-8-0

# హెచ్చరిక



# పాత్రములు

## పురుషులు

1. కాశీపతి—సక్కుబాయి భర్త
2. జ్ఞానయోగి—ఒక పంచమసిద్ధుడు
3. కృష్ణుడు—పండరినాథుడు
4. నారదుడు—దేవర్షి
5. కంభుశాస్త్రి- } అగ్రహారవాసులు
6. సెద్దిసెట్టి— } అగ్రహారవాసులు

## స్త్రీలు

7. సక్కుబాయి—కథానాయిక
8. అత్త—కథానాయిక అత్త
9. రాధాబాయి- } శ్రీకృష్ణుని దేవేరులు
10. రుక్మాదేవి— } శ్రీకృష్ణుని దేవేరులు

# సతీ - సక్కుబాయి

★★●★★

## ప్రథమాంకము

—[ ౧ ]—

1 వ రంగము—సక్కుబాయి యింటిసమీపవీధి.

ప్రవేశము—జ్ఞానయోగి కొందఱు శిష్యులతో.

( అందఱు - అనుబంధము 1. )

1 శిష్యుఁడు—గురునాథా! ఇది బ్రాహ్మణవీధిగా దోఁచుచున్నది. పంచమకుల సంజాతులమైన మనలను బ్రాహ్మణులు, పశువులకన్న నీచముగా జూచి, దరిఁ జేరనీయరుగదా! ఇట్టిపరాభవ మేదియు జరుగకమున్న మనంతట మనమే, వేఱొక వీధికిఁబోవుట శ్రేయస్కరము కాదా?

జ్ఞాన—నాయనా! సర్వభూతసమవర్తనాపరుఁడగు పరమేశ్వరుని యనంతసృష్టి యందు - తమతో సమానముగ సృజింపఁబడిన మనలను బ్రాహ్మణులు పరదేశీయుల కుండుట వారిజ్ఞానలోపము కావచ్చును. కాని బ్రాహ్మణవీధియందు నడచినంత మాత్రమున, ఈశ్వరుని దృష్టియందు మన మపరాధులము కాముగదా! అదియే మనకానందము. మూఢలోకముతో మనకు పనిలేదు—అయినను, లోకమంతయు నంతయజ్ఞానమయమై యుండునా?

సీ. "ఆత్మవత్సర్వభూతాది" దివ్యోక్తులు
దెలిసిన విజ్ఞాన తిలకు లుండ
"అస్పృశ్యతా దోష" హారణార్థమై జన్మఁ
గాంచిన ఘనదయాబంధులుండ
"ప్రకృతిసత్వము నిక్కమౌ ముక్తి" యను చిన్నె
కాసంత తెలియలో మునిఁగి యుండ
మాతృదేశదరిద్ర నివారణవ్రతులైన
గోకుల సద్భక్తగోటు లుండ
నిమ్నజాతుల రక్షింప నియతి గొన్న
రామమోహన పావన నాము లుండ

భరతఖండాన, నిక ముందు పంచములకు
పతన దుర్గతి గల్గునే ? ప్రభుండు లేండె? ౧

కావున మనకేమియు భయములేదు. దూషణ భూషణ తిరస్కారము లీనశ్వర శరీరమునకుం గాక, శాశ్వతమగు పరమాత్మకు లేవు. రంకు పోవుదము.

(అనుబంధము 1.) (పాడుచునిష్క్రమింతురు.)

[ తరువాత పాట వినుచు సక్కుబాయి ప్రవేశించును. ]

సక్కు——ఓహో! ఎక్కడిదీ గానము! బ్రహ్మానంద సంధాయకమై యొప్పుచున్నదిగదా !

గీ. దశదిశల హాయిగా ప్రతిధ్వనుల నీన
జల్లుమని మేనం బులుకలు సంతరింప
"రంగరంగా" యనుచు తంబురారవంబుం
గలసి విననయ్యె నభినవ కంఠరవము.

ఎన్నడును వినరాని యీభగవత్సంకీర్తన మీనాడు వినంబడుట చిత్రమే! అహో భక్త శిఖామణు లెవ్వరై యుందురో కదా ?

(మరల గానము వినంబడును. అనుబంధము 1)

సక్కు—— (కొంతతడవు విని యానందములో పారవశ్యమునంది తానును కలిసి పాడుచున్నది.)

[ తరువాత సక్కుబాయి అత్తగారు ప్రవేశము ]

అత్త——సక్కూ! సక్కూ! ఎక్కడ పెత్తనాలు పేళ్ళు చేస్తున్నావు? [చూచి] ఓసీ నీయమ్మ చచ్చిపోనూ! ఆ సంగీతాలేమిటి? ఆతాళాలేమిటి? అపాడటమేమిటి? నీకేమైనా దయ్యము పట్టినదా యేమే! – వసేవ్! నిన్నే! మాట్లాడవేమి? ఇంటిలో గంపెడు చాకిరీ వెనక వేసి, నడివీధిలో యీ సంగీతాలేమిటి? – ఓసిమొద్దా! నామాట వినంబడదా యేమే? – ఓసిపాపిష్టిదయ్యమా! ఎంత వాగినా మాట్లాడకుండా రంగా రంగా అని గొణుక్కుంటావు! నీరోగం వొదిలిస్తానుండు. [నెత్తిపైం గొట్టును]

సక్కు——(భక్తిపారవశ్యమున పాడుచు మూర్ఛనొందును)

అత్త——అయ్యో! అయ్యో! ఇదేం అఘాయిత్యమర్రా! దెబ్బయేమైన ఆయువు పట్టున తగలలేదుగదా; నాయనా! కాశీ! కాశీ! తొందరగా రారాబాబూ! ఈపాపిష్టి ముండకొంపదీసింది. తొందరగా రారాబాబూ! అయ్యో! నాయనా! నారాయణమూర్తీ! నాకొంపకు కనిలాగా యీదిక్కుమాలిన కోడలెక్కడ దాపరించిందిరా తండ్రీ!——

( కాశీపతి త్వరితముగ ప్రవేశము )

కాశీ——అమ్మా! ఏమిటింత హడావిడిగా పిలుస్తున్నావు? (సక్కుబాయిని చూచి) ఇదేమిటమ్మా! ఇది యిట్లా పడిపోయిందేమా ?

అత్త—అలేరా నాయనా! అదేవొచ్చినపుట్టిముణక! ఈజేష్ట పెద్దమ్మ పెప్పాడు చేసుకున్నావెరా అప్పుడే మనబ్రతుకు అల్లరిపాలయిందరా తండ్రీ! ఓసి దిక్కుమాలిన దానా! పోలీసులో—బొగ్గులో—మామీదికి, ఏయల్లరి తెచ్చిపెడతావే! సక్కుభామా!

కాశీ—ఊండవమ్మా! నీయల్లరి అఘాయిత్యమైపోను. జరిగిన సంగతేమిటో చెప్పకుండా ఏక వొక్కటేగడబిడ - పైత్యమా బండలో - గాలో గడ్డలో -

అత్త—పైత్యంకాదు; దానికార్థం - ఇంట్లో చాకిరీ అంతా ముసలి ముండని నామీదపడవేసి, యీమూలకొచ్చి సంగీతాలుతీస్తూవుంటే. "ఏమిటేయిదీ" అని అడిగితే మూగముండలాగా మాట్లాడిందిగాదు. నెత్తిమీద మునివేళ్ళతో యిట్టే అన్నాను. చచ్చినట్లు నేలమీద పడ్డది.

కాశీ—ఆదెబ్బయెక్కడైనా ఆయువుపట్టున తగలలేదుగదా! చెవులు మూసి నెత్తిమీద నీళ్ళయినా చల్లితే బాగుండును.

అత్త—అసలు దెబ్బతగిలిందెక్కడరా! మాడుపట్టున మునివేళ్ళతో ముట్టుకున్నానో లేదో అంతలోనే విఱుచుకుపడ్డది. అన్నీ దొంగవేషాలో - గడుగ్గాయి చేష్టలో కాకపోతేను -

కాశీ— (చెవులుమూసి తలపైనీళ్లుచల్లి) సక్కూ! సక్కూ!

సక్కు—(మెల్లగా తనలో కన్నులువిప్పకయే) రంగా - రంగా - రంగా

అత్త—రంగాకాదు రాళ్లు—చూశావట్రా కాశీ! ఎన్ని గడుగ్గాయి వేషాలు వేస్తువుందో! చచ్చినట్లు ఎంతసేపు పడుకుంటావు? ఇఁకలే! ఎంతకైనా తగుదువే నాతల్లీ!—రంగా రంగా అట. ఎవఁడే ఆ రంగఁడు! నీ అంకుమగఁడా వాఁడు?

సక్కు— లేచి హా! రంగా రంగా! పాండురంగా! ఎంతటి నిందావాక్యముల నీ పాపాత్మురాలిచెవిని వేయుచుంటివి! అత్తగారూ! పండరినాథుఁడగు నా శ్రీరంగధాముఁడు నాకే యననేల? సమస్త జగజ్జాలమునకును భర్తయే.

గీ. ప్రకృతి జనితమైనట్టి జీవప్రకాండ
మెల్ల కాంతామయంబు, సర్వేశుఁ డొకఁడె —
భువన భరణైక పూరుష మూర్తియగుచు,
నీజగంబును తానె భరించునమ్మ! 3

అత్త—అయ్యో. అయ్యో! దీనికేం పోయేకాలం పుట్టిందిరో నాయనా? దీని వేదాంతం మండ. లోకాని కంతటకీ వొక్కఁడే మొగుడంఘూంది. కుడుం మొదలు కొని గుండ్రాయిదాకా, అన్నిటినీ వొకటేకట్ట గడుతూవుండేమిట్రా:— లోకంలో ఆడవాళ్ళనీ మగవాళ్ళనీ లేనేలేరవ. దీనికీ, నాకూ, నీకూ, అందటికిగూడా, దేవుడు మొగుడవ;—దీనిదేవుడు దిబ్బలైపోను.

సక్కు...హరిహరీ; అత్తగారూ. అకారణముగ, భగవద్దూషణము గావించి, అతితరఘోరపాపకూపమున నేల గూలెదరు?

కాశీ - అమ్మా ! దీని కేమైనా పిచ్చాయేమిటే

అత్త - వట్టిపిచ్చికాదురా, మహాపిచ్చ !—

కాశీ—కొంపలో కాపురం చేస్తూవున్న సంసారివంటిదాన్ని పదపిచ్చేమిటే ? నీవంతా మతిలేనిమాటలా అంటున్నారం!-

సక్కు — అత్త గారా! నాదిపిచ్చి అని నాభర్తగారికి కొంచెమైనా సత్యమే. ఏమందు రేని...

గీ. పరమునకైన నిర్మలంబైన, పాండురంగ
భక్తియను నియమము, పిచ్చికో బడినదాన
ఎన్నటికినైన నాపిచ్చి పోయె శరణ్య
మట్టిపిచ్చి మీకును గల్గనభిలషింతు. ౪

అత్త—ఆఁ - ఆఁ - చాలా టారి. చాలా చక్కటూ. ఎంతమాటలంటూందో. దీని మహాపిచ్చి ముండకోసు. మన కంపతికినాడా తనలాగే పిచ్చెత్తిపోతే సంతోషపడు తుందట. దీనిసంతోషమూ చట్టుబండలుగానూ. ఇదిగో. నాయినా ! కాశీపతి, నువ్వేమో వట్టినోరు మెత్తని సన్యాసివి. అదేమో మదపిచ్చిముండ. ఇట్టాగే, నువ్వూ నేనుగూడ, నోరుమూసుకుని దీని ఆటలు సాగనిస్తే పుట్టారయెనా - పీరాశ్రో - పీపగలో - యిది కొంపలోంచిగూడ లేచి చక్కాపోతుంది. మనకందరికీ, అప్రదిష్ట దీసుకొస్తుంది ? వెంటనే, దీనికేదో వొక ప్రాయశ్చిత్తంచేసి, యీవెర్రి అణచలేకపోతే మిగిలిపోయిన తరువాత మిడికిన లాభమేమీలేదు. పెద్దముండను. నేను చెబుతున్నాను విను.

కాశీ - అమ్మా, ఐతే, యీపిచ్చికి పరిహారమేమిటంటావు ?

అత్త - పరిహారమా ? నేనేదో, ఆలోచించి, తగినసలహా యిస్తాను గాని, అందాకా, దీన్ని కొంపలోంచి కదలనియ్యకుండా, వీధిమొఖం చూడనివ్వకుండా వెయ్యికళ్లతో కనిపెట్టివుండాలి!

కాశీ - దానిమొహం. ఇప్పుడుమాత్రం ఎక్కడికి వెళుతూందమ్మా? వట్టి చాదస్తపు పెద్దమ్మగానీటమ్మా?

అత్త—ఓరి తెలిసివితక్కువ పెద్దమ్మా ! ఇన్నాళ్లనుంచీ దీనిలక్షణాలన్నీ చూస్తూ కుంటూ, చివరకు ఇదా సంపాదించిపెట్టింది? అందుకేనిన్ను చవటపీనుగను జేసి ఆ పెద్దమ్మగారి నిన్ను రెండుచేతులా పట్టుకుని ఆడిస్తుంది. అయ్యయ్యయ్యో! ఇంతమంద మతిసై పోయినావేమి ? చాదస్తపు పెద్దమ్మటరా, నువ్వుచాదస్తపు పెద్దమ్మవు; నేనుచాదస్తపు పెద్దమ్మను. [illegible] చాదస్తపు పెద్దమ్మరా! కొంపలు గాల్చే కొరివిరా నాయనా. [illegible] చేసిన మహాసంసారా బోటూ. చాదస్తమే, మనహాని... కొడుకా! తెలివి తక్కువ ఆలోచనలు చేసుకుంటూ - ఇది ఆడిందిఆటా - పాడింది పాటా, సాగనివ్వబోకురా సన్యాసీ !

కాశీ - అబ్బ! అట్లా కోప్పడతా వెందుకే అమ్మా? నేను మాత్రమేమన్నానే అది కొంపలోంచి లేచిపోతే నాకుమాత్రం సంతోషమటమ్మా ! ఈరోజునుంచీచూస్తు

వుండు నాతడాఖా. వీధిగుమ్మం తొంగైనా చూడనిస్తానేమో - (సక్కూనుచూచి) వనే! మొద్దూ అట్లా నిటారిలాగు నిలవబడి, తెంగి మొగం వేసుకొని తెలతెలపోయి చూస్తావెందుకే! పద కొంపలోకి - ఇక్కడ నిల్చేంపని! ఇట్లోచాకిరేవీమీలేదు? ఈసారి వీధిగుమ్మములో అడుగుపెట్టిచూడు! కాళ్లువిరగబొడుస్తానో లేదో. "దేముడు దయ్యం" అనివాని పాడు చెబ్బుంటావు చస్తావో లేదో. సన్యాసులనీ, చట్టుబండలనీ, బిచ్చంబెట్టిచూడూ చంపుతానో లేదో. నడవ్వేమి ఇంకా?

సక్కూ - (నడుముమ) పాండురంగా! కృపాంతరంగా! నీ మహిమలు పరమాశ్చర్యములుగదా తండ్రీ!

సీ. వితరణం బొనరింపఁ బ్రీతిగల్గెను దాత
నొక కాసయిను చేతి నుండనీవు
భూరిధనాఢ్యులై పోషింపగల శక్తి
గలుగువాడికి సంతు గలుగనీవు
ధనసంతతులు గల్గు దంపతులైనని
ద్దతి కానుకూల్యంబుఁ జెఱుతు వీవు
అధికపాపాత్ముల కభ్యుదయంబు స
జ్జనులకు నాశంబు సలుపు దీవు
పాండురంగ! నీప్రియభక్తవరులనోట
నీ భజనసేయగల స్వేచ్ఛనేని రయొసగ
విట్టి పరమాద్భుతక్రీడ లే విధాన
నీ మదికి మోదమును గూర్చునో మహాత్మ!— గీ

అత్త - ఈ పిచ్చిగోల బెట్టవద్దని ఎన్నిసార్లు చెప్పినా - మానవుగాదూ, మానవుగాదూ?

సక్కూ - హా పాండురంగా! పాండురంగా!

(అందరూ నిష్క్రమింతురు.)

జ్ఞాన - నాయనలారా! పరమసాధ్వీమతల్లియు - పాండురంగ భక్తిశీలయు - పరమపావన సాధుచరిత్రయు నగు సక్కూబాయి బాధింపబడుచున్న కష్టపరంపరలను దిలకించిరిగదా. ఆహాహా! ఆతల్లి పాదకంజాతములను భజించిన వారిపాపసంతతు లెల్లఁ బటాపంచలైపోవునుగదా!—

సీ. అత్తగారెంత గయ్యాళియైనను నామె
సేవలం దరమర సేయఁబోదు

తల్లి భయంబున తన్ను దండించు స్వ
కాంతుని దైవంబుగా దలంచు
భగవద్భజనతోడిపాటుగాఁ దన యింటి
పనులన్నిఁటిం దీర్చు భక్తిమీర
దూషణభూషణాదుల సమానంబుగా
భావించు నిర్మలభావ మొప్ప
రంగని జపింపనాశఁ జెలంగు వాక్కు
రంగనిం గనుకోర్కె మెలంగు దృక్కు
గలుగు సక్కును దర్శింప గలుగువారు
బహుపునర్జన్మరహితమౌ పదవిఁ గనరె!——

1 శిష్య - గురువర్యా! ఇట్టి పరమపుణ్యస్వరూపిణి కిట్టి బాధాపరంపరలుగలుగనేల?- పాండురంగడంత భక్తరక్షణాసక్తిదూరుఁడా?

జ్ఞాన - నాయనా! ఇదియా నీ సందేహము?

సీ. దేశసంరక్షణదీక్ష మహాత్ములు
కారాగృహంబుల గాసి పడరె!
అఖిలంబు రామచంద్రార్పణం బను రామ
దాసులు మ్లేచ్ఛబాధలను గనరె
మతధర్మములకయి ప్రీతినఁ దాల్చిన యేసు
చరితులైననుగాని కొఱత పడరె?
సర్వప్రతాపనాసక్తిగల్గిన చక్ర
వర్తులు శ్వపచసేవకులు గారె?
నిష్ఫలాకాంక్ష కర్తవ్య నియమంచు
నెంచుభక్తుల శ్రమల శోధించుచుంట
యీశ్వరుని నెమ్మనమున కభీప్సితంబు
పుడమిలో భక్తులే శ్రమపడెడువారు.

2 శిష్య - స్వామీ! అట్లయిన నీకష్టము లెన్నినాళ్ళు? సక్కుబాయిజీవితము కష్టములతో తెల్లవారవలసినదేనా? సత్కాల మాభక్తురాలి కెన్నటికిని రాదా?

జ్ఞాన - వెఱ్ఱివాఁడా! అత్తగారు పెట్టుచున్న కష్టములు ప్రాకృత జను కష్టములే కావచ్చును. గాని పరమశాంతాత్మురాలగు సక్కుబాయి కిప్పుడు మాత్ర సత్కాలము గాదా? దూషణ భూషణ తిరస్కారములు, నశ్వరదేహమునకే కా

అనశ్వరమగు నాత్మతుం గాదని యెఱిగినవారే జ్ఞానులు ? అట్టి యుద్దేశ్యముతోడ ఈ కష్టముల నెల్ల నోర్చి భవాంబుధిని తరించిన వారే భక్తశేఖరులు ! వారియం దీశ్వరుడు సదాప్రసన్నుడై అభేదప్రతిపత్తిని గల్గియుండునని యెఱుంగుడు !—మనము శీఘ్రముగాం జని యింక నాపుణ్యాత్మురాలి దివ్యసందర్శన లాభమునం గృతార్థజన్ముల మగుదము రండు ?

శిష్యులు—చిత్తము.

(అందరు నిష్క్రమింతురు.)

## 2 వ రంగము—(కాశీపతి యింటిలోని చావడి)

## ప్రవేశము—(ఒంటరిగ, కాశీపతి అటునిటు దిరుగుచు )

కాశీ—(స్వాగతము) ఏపనిచేతామన్నా తోచదు. ఏది ఆలోచింతామన్నా మనస్సు నిర్మలంగా వుండదు. ఇరవైనాలుగుగంటలూ, మనస్సులో ఏమిటో - దిగులు దిగులుగా - గుబులు గుబులుగా - నల్లులుకుట్టినట్లు - దోమలుకఱచినట్లు - చీమలు పాకినట్లు - వుంటుంది. కొంపలో వ్యవహారమంతా యీావరుసగా వున్నప్పుడు—నాకే కాదు, ఎవరికిమాత్రం ఏంతోస్తుంది ! ఎవడి మనసుమాత్రం ఏం నిర్మలంగా వుండేడుస్తుంది ! మాఅమ్మలక్షణం చూద్దామా అంటే ఆవిధంగావుంది! దీని లక్షణం చూద్దామా అంటే —యీా విధంగావుంది ! మాసక్కుబాయికి అస్తమానమూ దేవుళ్లూ దయ్యాలు జపాలూ తపాలూ—మాఅమ్మకు అస్తమానమూ— అవన్నిమానుకోవలసిందని, దాన్ని సణగటం గొణగటం సాధించటం కొట్టటం. నాకు వీళ్లద్దరినీ చూచి కుళ్లికుళ్లి లోలోన కృశించి యేడవటం - ఇవ్వీ మాపనులు—"పోనీ, ఆవిడగారు యింటికైన పెద్దది—ఆమె కిష్టంలేని పనులు నువ్వెందుకు చేస్తావే" అంటే, అది వినదు. "ఇంటెడు చాకిరీ గొడ్డువలె చేస్తూనే వుండరావ్యేను; అది యేబొమ్మలకు మొక్కుత్తే నీకెందుకు - ఏపాటలు పాడుకుంటే నీకెందుకు ? నువ్వయినా వూరుకోరాదటమ్మా" అంటే; మాఅమ్మ వినదు. వీళ్లిద్దరినడుమా అడకత్తిలో పోకచందంగా నేను నలిగిచస్తున్నాను ! మాఅమ్మ దాని మీాంది నేరాలు నాతో చెప్పకుంటుంది. అది తవకష్టోభంతా పాండురంగనితో చెప్పకుంటుంది. నేనెవడితో చెప్పుకునేది ! నాదుఃఖం వినేవాళ్లెవరు ? ఐనాగానీ, మాఅమ్మకు, యింతపట్టుదలవుండటమనేది ఎంతమాత్రం నామనస్సుకు నచ్చడంలేదు. పాపం సక్కుని మాఅమ్మ కొట్టే దెబ్బలు చూస్తే నాకే కడుపు తరుక్కుపోతూవుంటుంది ; ఎవరైనా నమ్ముతారో లేదోకాని, ఒక్కొక్కప్పుడు ఆదెబ్బలుచూచి, దుఃఖం ఆపుకోలేక, చాటుకుపోయి, ఒంటరిగా కూర్చుండి నాలోనేనే ఆకడుపులోగుబులు అణిగేపర్యంతరం, ఆడుదానికన్నా అన్యాయంగా ఘోడు ఘోడున వెక్కివెక్కి యెవరైనా చూచి నవ్విపోతారని కన్నీరుతుడుచుకొని బయటికివస్తూవుంటాను॥ అన్నిదెబ్బలు తింటుందా—అదెక్కడి వజ్రశరీరమో - అమ్మా అనదుగదా—అబ్బాఅనదుగదా—కంటతడిపెట్టుకోదుగదా—అంటే గింటే — "పాండు

రంగా" అనడం-లేకపోతే మళ్ళీ "అత్తగారూ" అని పిలవటం - ఆ పిలుపులోనైనా వొక ఆగ్రహముంటుందా? ఆక్షేపణ వుంటుందా? అతిభక్తి - అతిగౌరవమున్నూ - తెల్లవారుజామున నిద్రయేమి లేస్తుందో - అంతే. మళ్ళీ నడిజామువరకూ, ఒక్కవిధంగా, వంచినతల ఎత్తకుండా ఇంటెడుచాకిరీ గొడ్డువలె చేస్తుందిగదా! ఈపని కష్టమనేదున్నదా? ఆపని సుఖమనటమున్నదా? ఈపని రోతఅనడమున్నదా? ఆపని ప్రీతి అనడమున్నదా? చిన్నమొదలుకొని పెద్దదాకా, అన్నిపనులూ సమానమేకదా! అంటే మాఅమ్మ అగ్నివర్షం కురిపిస్తుందిగాని, ఇటువంటి కోడలు ఆవిడ కన్నిజన్మ లెత్తితే లభించను! ఇట్లాంటి అమాయకురాలిమీద, ఇల్లాంటి విధేయురాలిమీద, యింత కార్పణ్యం ఆవిడగారి కెందుకో, నా కేమీ తోచకుండావుంది. చాకిరీ చేస్తూ చేస్తూ అది యే పాటలు పాడుకుంటే యీవిడ కెందుకు? ఏబొమ్మలకు మొక్కుకుంటే యీవిడ కెందుకు? ఊరుకోగూడదూ! ఐనా - రామకృష్ణా అనుకోవడం రంకా? భగవంతుణ్ణి పూజించడం పాపమా? మా అమ్మకు బొత్తిగా మతిపోతున్నట్టుంది! తన మట్టుకు తనకు దేవుడూ దయ్యమూ శూన్యంగదా! ఏకాదశీ ద్వాదశీమాట ఎప్పుడో మఱచిపోయిందిగదా! అతిథీ అభ్యాగతీ అసలే నాస్తిగదా! ఎదురుతిరిగి దానికి పిచ్చిట! అందులో పట్టిపిచ్చి గాదట! మదపిచ్చిట.! నే నేమైనా కాస్త దాన్ని తన కేసుకొచ్చి మాట్లాడితినా కఱచినంత పనిచేస్తుంది! ఇవన్నీ సరేగాని - వారంరోజుల నొక్కసారైనా దాన్ని గదిలోనికి రానివ్వదేం పాపం! నేను తనకుచేసిన నేరమేమిటో, రాత్రి అందరిభోజనాలూ ఐనతర్వాత నాలుగు మెతుకులు తిని, మాఅమ్మకాళ్లు పిసికి-నాకాళ్ళు కూడా పిసుకుదామని, ఆశ కాబోల్సును — వెఱ్ఱిముండ! పాపం దాన్ని పడకగదిచాయలకే రానివ్వకుంటే ఏంచేసుకుంటుంది. నాగొంతుకోయ? అదేం పాపమో మొదట్నుంచీ, మా అమ్మ పేరు చెపితే నాకు హడులే! హడులుగాకపోతే యీతెగ నా కధికారమెక్కడినుంచి వస్తుంది? ఇనప్పెట్టె తాళంచేతులు మా అమ్మ మెళ్లో — ఇంటో అధికారం మాఅమ్మనోట్లో - వేరే ఏదైనా నౌకరీఐనా యేడ్చి నాల్గుడబ్బులు తెచ్చి నాభార్యా నేను వేరుబడదా మనుకున్నా మనకు వోనమాల తరువాత వొక్కక్షరమైన డొక్కశుద్ధి లేదయ్యెను. ఉద్యోగానికీ మనకూ ఊర్ధ్వలోకానికీ, అధోలోకానికీ వున్నంత సమీపమయ్యెను! - ఏగంగలో దిగేది!.................

.........................ఐనా - నే నిన్ని ఆలోచనలు ఏమేమిటో వెఱ్ఱివెఱ్ఱిగా చేస్తున్నానుగాని - ఇంకోసంగతి గూడా అవశ్యంగా, ఆలోచించదగ్గదే...... మాఅమ్మ యీనాటి మనిషి గాదు! వయస్సు మీఱినమనిషి! వడితగ్గిన మనిషి, అనుభవంగల మనిషి, అన్నిసంగతులూ తెలిసినమనిషి అటువంటిదానిమాట కేవలంగా కొట్టివేసి భార్యమంచిది అమ్మే చెడ్డది అని నే ననుకోవటం పాపంగాని మఱొక్కటిగాదు! మాఅమ్మ చెప్పినట్లు దీని కొకవేళ నిజంగా పిచ్చేనేమో! దాని అందం జూచి, నేనే, తప్పుదార్ని బోతున్నానేమో! పిచ్చేకాకపోతే లోకంలోవున్న ఆడవాళ్ళ నింతమందిని చూస్తువుంటాంగదా - ఎవళ్లయినా - దేవుడన్నా దేవుడుగుడన్నా. ఏశుక్రవారంనాడో - ఏసాయంత్రంవేళో, దేవుడుగుళ్ళోకి వెళ్లటం దణ్ణం బెట్టో

కొబ్బరికాయ కొట్టా రావడం వుంటుందిగాని—పొద్దస్తమానం అదే స్మరణేమిటి? కొమ్ము నోకాన్ని చంకనెత్తుకొని, నారంగడా నాసింగడా అని దేవిళ్లాడటమేమిటి? అన్నం తింటున్నా—ఇల్లలుకుతున్నా—పిచ్చిపిచ్చి పాటలు పాడటమేమిటి? వెఱ్ఱిముండలాగ వేదాంతాలు వల్లించటమేమిటి? ఎక్కడో తనకు దేవుడు కనబడుతూ వున్నట్లు—తనతో మాట్లాడుతూవున్నట్టూ ఆవెఱ్ఱిఘోరణేమిటి?—అన్నీ అట్లా వుండగా అన్ని దెబ్బలు గొట్టినా నాటకపోవటమేమిటి? పిచ్చిబలం గాకపోతే గుటికీ గుటుకీ అంతంతదెబ్బలుకొడుతుంటే మాఅమ్మ - నవ్వుకుంటూ మామూలు మనిషి లాగ ఎవళ్ళు దులిపేసుకుని తిరగ్గలరు? అచ్చే సందేహంలేదు—ఇది తప్పకుండా పిచ్చే - మదపిచ్చంటే నాకు నమ్మకంలేదుగాని, ఇది ఏదోవిధమైన పిచ్చిమాత్రం గాకపోదు! మాఅమ్మమాటలు ఆలోచించకుండా కొట్టివేయవలసినవికావు! ఐనా పెద్దలు మాతృదేవోభవ అన్నారుగాని పత్నీదేవోభవ అనలేదుగదా!—అయ్యయ్యో! చక్కగా చదువుకున్నది! విచక్షణగా, ఇంట్లో పనిపాటలు చెయ్యగలది! అందానికా యీవూళ్లో ఆడవాళ్ళంతా బలాదూరు! అటువంటిదానికి.............. ఏమనుకుంటే కార్యమేముంది! దానిగ్రహచార మదీ నాగ్రహచార మదీ!

[తెరలో] కాశీపతీ! కాశీపతీ!

కాశీ—అదుగో! మాఅమ్మగారు పిలుస్తోంది! ఆఁ—ఆఁ—వొస్తున్నా—

[నిష్క్రమించును]

—:o:—

## 3 వ రంగము — కాశీపతి యిల్లు.

పరివేశము— { పిండి విసరుచున్న సక్కుబాయియు ప్రక్కగా, శ్రీకృష్ణ విగ్రహమును.

సక్కు—తండ్రీ! గోపాలకృష్ణా! నాముద్దులకృష్ణా!-ఈదినమున పాలేల కడుపార నారగింపలేదు? ఏదీ! నన్ను చూడనిమ్ము అయ్యయ్యో! వట్టికడు పేడ్చుచునేయున్న వాఁటయ్యా! నాతండ్రీ! నీకడుపేడ్చిన, నేనేడ్వనా బాబూ! చెప్పుము. బతిమాలి యడుగుచున్నాను. పాలెందుకు త్రాగలేదయ్యా! నన్నేడ్పించుటకా! ముద్దులుమూటఁ గట్టుచుండు నీమొగమెంతలో వాడిపోయినది! అంత యాఁకలి కోర్వలేనివాఁడవు నాపై కోపగించి పాలుత్రాగవు మానితివా? కాక వ్రేపల్లెలో తల్లి యశోదాదేవి త్రాగించిన పాలవలె రుచిగాలేవని త్రాగనూనితివా- గోపకాంతల యిండ్లలో, దొంగ తనముగా, సుష్టుగ కడుపుబ్బాకి పొట్టనింపుకొనిన పాలవలె తియ్యనివిగావని త్రావమాని తివా? [illegible] మంటిముద్దలను గుటుక్కున మ్రింగువాఁడవఁట నే! నాతండ్రీ! నేను భక్తితో నిచ్చినపాలు నీ మృద్గుళికలపాటియైనను రుచిగా నుండలేదా? శ్యామ లాంగా! అయ్యయ్యో! అసలే నల్లఁగానున్న నీశరీరమునకీ మురికి యెక్కుడనంటె నయ్యా!—ఏమంటిలో పొరలాడి వచ్చితివి బాబూ!—గొల్లపిల్లలతో, కోతికొమ్మచ్చు లాడితివా? తల్లి యశోదమ్మను తంటాలుబెట్టితివా?—గొల్లపడుచులు కొంగులుబట్టిలాగి

పట్టుకొనవచ్చినచోఁ బారిపోయితివా? ఇన్ని యాగడములు — ఇంత మంకుతనము ఇన్ని యల్లరిచేష్టలు — నీవు పుట్టక నేర్చుకుంటివా? పుట్టి నేర్చుకుంటివా? కొంటె కుఱ్ఱఁడా! ఈచేష్టలు తగునఁటయ్యా నాతండ్రీ! కాకున్నను నీకు గారాబ మధికముచేసి, మీయమ్మ నిన్ను మితిమీఱఁజేసినది సుమా!

సీ. గోపెమ్మ నినుఁ బట్టి కొసరి త్రాఁటితోఁ గట్టెఁ
గాని బల్మిని ఱోట గట్టదయ్యె!
వల్లవకాంతలు మల్లెపూవులచెండ్లఁ
గొట్టిరి కొరడాలఁ గొట్టరైరి!
కాళీయఫణిరాజు కాళ్ళఁ జుట్టెనె కాని
గాటంపు విష మెక్కఁ గఱవడయ్యె
నినుఁ దృణావర్తుండు నీలాంబరమునఁ ద్రి
ప్పెనుగాని భూమిపై విడువఁడయ్యె
నిన్ను దర్శించినంతనే నిఖిల జనులు
ఘనులు పశుజాలమును భూతపంచకంబు
వివశమతు లయి గారాము వెట్టినారు
ఎట్టి యింద్రజాలము ప్రయోగించినావొ.

[జ్ఞానయోగి, శిష్యులు ప్రవేశము]

జ్ఞాన—(దూరమున నుండియే సక్కుబాయిని చూచి) వత్సలారా! జ్యోతిర్మయం బగు నాదివ్యమూర్తియే, మహాభక్తురాలును, పతివ్రతాతిలకమును నగు సతీ సక్కుబాయి! కన్నుల కఱవుదీర నాదేవీమూర్తిని సందర్శించితిరా? చేతుల పావమార నా సీమంతినీమతల్లికి నమస్కరించితిరా? శ్రవణముల త్రుప్పువాయ నాసద్భక్తురాలి సూక్తి రత్నముల నాకర్ణించితిరా? నేటికిగదా మన జన్మములు చరితార్థముగాంచినవి! అభక్త శ్రేష్ఠురాలు భక్తిపారవశ్యమున, నేమియేమి చేయుచున్నదియో తిలకించితిరా?

గీ. బాలగోపాల చిన్మయరూపంబు గల్గు
ప్రతిమ నతిప్రేముడి నిజాంకపాళిఁ దాల్చి
యమితభక్తిని ముచ్చట లాడు వదిగో!
భక్తిసంధాయి యా సక్కుబాయి తొలుదుట.

1 శిష్యు—ఆహా! కన్నులు తరించె! జన్మ సార్థకమయ్యె! నేడెంతటి పుణ్యదినమో కదా!—భక్తాగ్రగణ్యురాలా! ఇప్పటినుండియే నీపాదపద్మముల కనేకకోటి నమస్కారములు! (నమస్కరించును.)

శిష్యు—భక్తిపరవశతం జొక్కియున్న యీపుణ్యాత్మురాలా! నీకనంత కోటి ప్రణామములు! గురువర్యా! ఈ సక్కూ మహాసాధ్వి భక్తితత్వము గాంచుచున్న మనకే తనువులు పరవశమగుచున్నయవి! గోపాలకృష్ణునియం దైక్యమై పోయిన యీమె యెంత పరవశురాలై యున్నదో కదా!

సక్కు:- ఇంకను కన్నులు తెఱచుకొనియే యుంటివా తండ్రీ! నిదురపోవూ! నిదురవచ్చుటయే లేదూ? ఔనుమఱి - నిద్రయెట్లువచ్చును? పాలుత్రావకమారాము చేసితివిగాదూ! పాలు త్రావకున్న నాఁకలియగునని - ఆకలియైనచో నిద్రపట్ట దని - నామాట వింటివా నాతండ్రీ! వినను నాకెత్తియేకాని, నీ కాఁకలి యగుటెట్లు? నిద్రపట్టు టెట్లు?

గీ. నిఖిలకమలోదరాండముల్ నిండియున్న
బొజ్జలోపల నాఁకలి వొడము టెటులు?
సంతతము భువనావనాసక్తమైన
కన్నుదోయికి నిద్దుర గలుగు టెటులు?

జ్ఞాన—ధన్యోస్మి! ధన్యోస్మి! ఆహాహా! ఎట్టిపరమార్థవాక్యములు వినఁబడు చున్నవి.

1 శిష్యు—గురుచంద్రమా! ఈ సతీమణి యెంతకాలమైనను తన్మయ చిత్తమున నిట్లే గడుపుమని తోఁచుచున్నది! మనల నీమె యనుగ్రహించు టెప్పుడు?—

జ్ఞాన—నాయనా! నేనీ దేవిదృష్టిని మనవంకకు క్షణములో నాకర్షించెదను - చూడుము-

(శిష్యులతో కలసి భజన చేయును)
(అనుబంధము 2.)

సక్కు—(విని విని ఆనందముతో తాళము వేసిస్వగతము) ఆహా! ధన్యాత్ము రాలనైతిని! కొన్ని దినములకింటను నిట్టిదే మధుర తర పాండురంగ సంకీర్తన మీ శ్రవణములకు సోకెను-నేఁడును, అదియే గానము! అదియే కంఠమాధుర్యము! అపరమ భాగవతాగ్రేసరు లెవ్వరో దర్శించి తరించెదఁగాక! (సమీపించి) ఓహో! ఎంత తేజో మయ స్వరూపము! భక్తివైరాగ్యములు రెండును గలిసి యీ మూర్తిం దాల్చినవియా యేమి చెప్పుమా!

సీ. శుభదేహమున ద్వాదశోర్ధ్వ పుండ్రంబుల
నద్దినట్టులు తీర్చి దిద్దినాఁడు
మొగమునఁ దలపైన మొదలంట నెరసిన
శ్మశ్రుజటాబంధ సమితివాఁడు

కంఠమున రుద్రాక్షలు కంఠభాగం బెల్ల
పేర్లుగా నలమిన వింతవాఁడు
ఒకచేత తంబుర యొకచే చిఱుత లూని
శృతితాళముల హంగు సేయువాడు
జానువులపైనఁ గాషాయశాటి దాల్చి—
రంగ రంగా యటంచు నోరార పాండు
రంగ విఠలుని భజనఁ జెలంగు నితఁడు
సిద్ధుఁడో—సాధ్యుఁడో - రాజశేఖరుండో!— ౧౧

మహాత్మా! పాండురంగని స్మరించుచు భక్తిరసావతారులో యన తేజశ్శాలులరై వెలుంగుచున్న తమ రెవ్వరై యుందురు? సిద్ధులా? సాధ్యులా? శివకేశవచతుర్ముఖులలో నొక్కరా? భూతలంబునకు మావంటి యజ్ఞానుల ననుగ్రహింప దయచేసిన నారదులా? తుంబురులా? ఎవ్వరు?

జ్ఞాన—అమ్మా! నే నంతటివాఁడను గాను. ప్రాకృతమానవమాత్రుఁడను. పుట్టుకచే మాలవాఁడను. జను లందఱును నాయందలి ప్రేమచే నన్ను జ్ఞానయోగీ యనిపిలుచుచుందురు!

సక్కు—స్వామీ! భక్తశేఖరులగు తమదర్శనమునఁ గృతార్థురాలనైతిని. ఆనాఁడు తమ యపూర్వమధుర సంకీర్తనముచేత భగవద్భజనం బొనరించియుంటిరి. అనుగ్రహించి యాగానము నే యింకొకసారి భజించి యీ దీనురాలి కానందమున్ గూర్ప వేడుచున్నాను.

జ్ఞాన—అమ్మా! భగవన్నామ సంకీర్తనమున కింత ప్రార్థనమేల? ఇదే, యాగానము నాకర్ణింపుము.

(శిష్యులు పల్లవి యందుకొనుచుండఁగా పాట పాడును)

(అనుబంధము 1.)

సక్కు—(వినుచు పరవసురాలై- వారితోఁగలసి పాడుచు నృత్యము చేయుచున్నది.)

(అత్త ప్రవేశించును)

అత్త—(చూచి తత్తరపడి ముక్తకంఠముతో) వరే! అబ్బాయీ! కాశీపతీ! ఇంకేముందిరా! ఇంకేముందిరా! మనకొంప నిలువునా నట్టేట్లో బుడుంగున ముణిగి పోయిందిరాగో! నాయనో (సక్కును చూచి) ఎన్నిసార్లు నీనోట్లో గడ్డబెట్టినా యింత బుద్ధిలేదేమే నీకు? ఇంత విడబడ్డావేమే - వీధిలోకి రావద్దంటే ఈ కోఁతి ముండకొడుకులతోఁ గలిసి యీగంతు లేమిటే? ఈ అల్లరేమిటే? ను

కాశీ—(ప్రవేశించి) ఈనడువీధిలో యీగంద్రగోళమంతా యేమిటి? ఈతాళాలేమిటి? ఈతప్పెట్లేమిటి? ఈ గంతులేమిటి? ఈ రంతులేమిటి—మా ముండగూడా

యీ పెంటపాటి బైరాగుల మఠంలో చేరింది? ఇందాకట్నుంచీ తిన్నగా చూడలేదు. బాగానే వుంది వరస!

అత్త—"బాగానే వుంది వరస" అనుకుంటూ నిల్చబడి చూస్తా వేమిరా? వాఁడు పచ్చపు దొంగముండాకొడుకురా? ఆముండకు మందో మాకో పెట్టి మనస్సు విరిచాఁడురా? దీన్ని లేవదీసుకొని పోతున్నాఁడురా! దాన్ని నాలుగూ వాణ్ణి నాలుగూ చావగొట్టి దాన్ని లోపలికీ వాణ్ణి బయటికీ, సాగనంపవేమిరా? నీయమ్మ కడుపుకాల!

కాశీ—ఎవడవురా నువ్వు! ఎవడవురా నువ్వు! [కొట్టబోవునట్లు మీఁదికి పోయి] నువ్వా నాయనా! ఆహాఁ—మావీధికిగూడా దాపరించినావా? ఈసారి పట్టపగలే ఆరంభించావూ? కనబడ్డ ఆడవాళ్ళనల్లా లేవదీసుకొపోవటం మొదలుపెట్టావా యేమిటి! నిన్ను పోలీసులకప్పగిస్తావుండు! కాశీపతెంటే ఏమనుకున్నావో ఖబర్దారుగా తిరుగు...............వీఁడు దొంగముండాకొడుకే అమ్మా ఆవేళ కామాక్షమ్మగారి పినతల్లింట్లో, కన్నంవేసిన వాళ్ళు వీళ్ళు ముగ్గురేనే. మఱునాడు పోలీసువాళ్ళు వీళ్ళని పోలిసెట్టి సత్రంలో పట్టుకొని, తాణాకు లాక్కుపోయి, చేయఁగలిగినంత అల్లరి చేసి వదలిపెట్టారు. ఈమధ్య మళ్ళీ వీడెక్కడా ప్రజలకంట పడటంలేదు. ఇన్నాళ్ళకు మళ్ళీ యీ వీధిలో వెలిశాడు. మాలవాఁడు కూడాను—

జ్ఞాన—బ్రాహ్మణోత్తమా! తమరు పల్కినదానిలో నంతయు నసత్యము కాదు. నేను కనకమును నపహరించి, కాంత నపహరింపదలచినమాట నిజమే! కాని, అవి మీరుపల్కిన కనకమును గాంతయును మాత్రము కావు—అవి వేఱుగా నున్నవి—

గీ. దొంగిలింపరాని రంగభక్తి యనెడు
కాంచనంబు నపహరించినాను;
వ్యభిచరింపరాని యా ముక్తికాంతను
జేరి, సౌఖ్యమంద గోరినాను.

అత్త—విన్నావమ్మరా! విన్నావటరా! తానే చెప్పుకుంటున్నాడు. ఇంకెక్కడో దొంగతనాలు చేశాడమ్మ! ప్రొద్దునలేస్తే వీఁడి కిదేపనిలాగ కనఁబడుతూంది. ఇంకా కనిష్టేబుని పిలవ్వేమిరా? పిలవ్వేమిరా!

జ్ఞాన—అమ్మా! నిజముగా నాకిదియేపని! ఇంతకన్న నుత్తమకార్యమీజన్మల కేమియున్నది?—

కాశీ—నీదిమతీ చాదస్తమమ్మా! దొంగ నేను దొంగనని చెబుతాఁడటమ్మా! వాఁడు టక్కరివేషం వేసి, వేదాంతం ఏడుస్తున్నాఁడు!

అత్త—దొంగముండాకొడుకులకు, వేదాంతాలకేమి తక్కువ నాయనా!

కాశీ—(నక్కను చూచి) నువ్వింకా కొరతవుపాతిన స్తంభంవలె - అట్టా నిలుచుంటావెందుకే! ఆబిచ్చపు ముండాకొడుకు మొహం తేరిపారా ఏం చూస్తావే సంసారివిగావూ! సిగులేదూ! పద - ఇంట్లోకి - పళు రాలగొట్టగలను - [జ్ఞానయోగినిఁ

జూచి) ఏమిరా! దొంగా! అసలు పంచముఁడవుగదా నువ్వు! బ్రాహ్మణవీధి కెట్లా కొచ్చావురా? వచ్చినవాఁడవు - ఏమూలనుంచో, కళ్ళుమూసుకుని దాఁటిపోక — నాయింటి కెందుకొచ్చావురా? నాపెళ్లాంజోలి నీకెందుకురా? ఇంకా కదలవేం? పదిమంది బ్రాహ్మల్ని పిలిచి బడితెబాజా చేయించమన్నావా? మెల్లఁగా చెపుతున్నప్పుడే విని మెదలకుండా వెళతావా?

జ్ఞాన—అయ్యా! రూపొందిన భక్తితత్వము—అవతరించిన వైరాగ్య స్వరూపము—పతివ్రతలలో మేలుబంతి—అరిషడ్వర్గశాత్రవ దేవతయగు మాయి శ్రీసక్కుబాయి, మనయందటి యదృష్టవశమున మీయింట వెలసియున్నదని యెఱింగి — దర్శించి జన్మమును సార్థకపరచుకొన నాశపడి యిందువచ్చితిని. జనని దర్శనమయ్యె— జన్మము తరించె- నేనింక వెడలిపోవుచున్నాను! ఆగ్రహింపవలదు!

కాశీ—నీయమ్మ కడుపుకాల! మళ్లీ నాభార్య పేరెత్తుతున్నా వెందుకురా? మాలవాణ్ణి ముట్టుకుంటే మైలపడతానని చూస్తూన్నానుగాని, మడేమలు విఱుగబొడుతుందును! ఉండుండు! ముట్టుకోకుండానే, నీరోగం వొదిలిస్తా! (తిరుగలిదగ్గఱి పిండిని దీసి, జ్ఞానయోగి కన్నులలోఁ గొట్టును)

జ్ఞాన—రంగార్పణం - శ్రీరంగార్పణం - శ్రీపాండురంగార్పణం -

అత్త—అదేమిట్రా! అదేమిట్రా! నీపాడావుడిమండ! అరసోలెడు పిండి ఆ విధవమొహాన్ని గొట్టావేమిరా! వీఁడికి ఇదిగాదురా నాయనా ప్రాయశ్చిత్తం. నేను చేస్తానుండరా! (లోనికి బోయి కలయంపిఁ దెచ్చి, జ్ఞానయోగి మొగముపైఁజల్లుచున్నది)

జ్ఞాన— రంగార్పణం ! శ్రీరంగార్పణం ! శ్రీరంగార్పణం! - అమ్మా! పూజ్యురాలవగు నీతిమహాస్తములతోఁ జల్లఁబడిన యీకలయంపివలన, నాశరీరము పరమ పవిత్రంబయ్యె! ధన్యోస్మి! ధన్యోస్మి!

గీ. హరి చరణజాత హర జటాభరనిపాత
యగు సురాపగామాత పుణ్యామృతంబు
విశ్వశుభదాత గోమాత విమలనిమ్న—
కలసి నను ధన్యచరితునిఁగా నొనర్చె. ౧౩

అమ్మా! నీకు నమస్కారము! సక్కుమహాదేవీ! ఇటునుండియే నీపాదపద్మముల కనంత ప్రణామములు! ఇఁక నాకు సెలవు!

[అనుబంధము 2]

[శిష్యులతో నిష్క్రమించును.]

కాశీ— పో! దొంగముండాకొడుకా! పో! ఇంకోసారి ఇంటిఛాయలకొచ్చావా అంటే, చచ్చావనుకో! గుండెల్లో నిద్రబోతా! జాగ్రత్త! -

అత్త - అబ్బబ్బ! ఎంతసేపటి కొదిలిందిరా శనిగ్రహం! - (సక్కును జూచి) ఏమి! పత్తిత్తొయల్లాగ, గుడ్లు మిటకరించి చూస్తావేమే! పిండివిసరవే తల్లీ అని చిలక్కుచెప్పినట్టు చెప్పిచూస్తోంటే - నీకేం పెద్దరోగ మొచ్చింది! గొప్పాడు

గింజలూ గిన్నెలో నేఫుంచి వీధివెంటఁబోయ్యే అడ్డమైన దొంగగాడిద కొడుకులతోటి కలిసి తైతక్కలాడటమేనా నీకు పని? మగవాడివిగావూ? మర్యాదా - మానమం ఎటుంగవూ? భగవంతుఁడు అనుగ్రహించలేదుగాని పదిమంది బిడ్డలతల్లివి గావలసిన యీడొచ్చేనే! ఇంక నీకు, జ్ఞానమెప్పుడొచ్చేదెప్పుడు? ముత్యాలమ్మ సమర్తాడినప్పుడు - ఎన్ని దెబ్బలు గొట్టినా నన్ను గాదని అనుభవిస్తావు! సీయమ్మ చచ్చిపోనూ! ఈరోజునుంచీ గుమ్మంలో అడుగు బెట్టవు గదా - బిచ్చపు విధవలతో ఎగురులాడవుగదా! - బుద్ధి వస్తుందా? వస్తుందా?

(కొట్టును)

సక్కు—హా! పాండురంగా! పరాత్పరా!

అత్త—నీ పాండురంగఁడూ—నీపనీ—భగ్గున మండినట్టే వున్నైగాని ఇంట్లోకి పద!—చెపుతా నీసంగతీ! నీదేవుఁడి సంగతీ— (కొట్టును)

సక్కు—(పోఁవోవుచు, విగ్రహము నెత్తుకొనును)

అత్త—అదుగో! అదుగో! అదే వద్దన్నపని! ఈ పాడుబొమ్మలే నీకొంపా శాకొంపా తీస్తున్నవి! ఆబొమ్మనిటు తే? అవతల గిరవాటువేస్తేకాని నీవు దారికిరావు!— (విగ్రహమును లాగుకొని పారవేయును,)

సక్కు—కృష్ణా! కృష్ణా! నాతండ్రీ! నన్నువదలిపోయితివా? నన్ను వదలిపోయితివా?—

అత్త—నోరెత్తితే నక్కళ్ళు విరగబొడుస్తాననుకో!—(గెంటును) (ఇద్దఱును, నిష్క్రమింతురు)

కాశీ—పట్టిపిచ్చిసన్యాసి! అయ్యయ్యో! ఎన్ని దెబ్బలు పడుతూందో! మొద్దంటి మొగుణ్ణిబతికి ఎదురుగావుండి, చూస్తూగూడా, ఏమీచేయలేక పోతున్నానుగదా! ఇఁక నా బతుకెందుకు? ఇక్కడిదెబ్బలుచాలక, ఇంకాలోపల నీసంగతి చెపుతానంటూ లాక్కెళ్ళింది! ఏమైనా చెయ్యనియ్యి, దాని కర్మం నే నేంచేసేది? ఎదురుగా వుండి మాత్రం, దానికష్టం చూడలేను. గదిలోకెళ్ళి ముసుగు బెట్టుకుని పండుకుంటా!— (నిష్క్రమించును.)

## 4 వ రంగము—పండరీ పుర దేవాలయము.

ప్రవేశము—(శ్రీ కృష్ణుఁడు, రాధామాయి.

(కృష్ణుని శరీరమునిండ పిండియు, కలయంపియు నుండును.)

రాధా—(పైటచెరంగుతో కృష్ణుని దేహమునుతుడుచుచు) నాథా! జగన్నాథా! ఏమి యీ వైపరీత్యము? ఏమి యీ వింత?—

గీ. పరిమళాగరుగంధ బంధురశరీర,
మింతలో, నింత దుర్గంధ మెట్లుగాంచె ?
ఘనశరచ్చంద్ర చంద్రికా కాంతిమించు
వదనమున కింతలోన వైవర్ణ్యమేమి ? ౧౪

శ్రీకృ—దేవీ! అదియొక చిత్రమైన గాథ, చెప్పిన నవ్వుదువేమో ?

రాధా—మీలీలలను విని నవ్వని గడియగలదా ? చెప్పుడు.

శ్రీకృ—అగ్రహారమను పురమున నాయంతరంగభక్తురాలగు సక్కుబాయి యను ప్రతివ్రతా మణిగలదు. ఆమెను సందర్శింపవచ్చిన జ్ఞానయోగియను నాభక్తునిపై నాగ్రహించి, సక్కుబాయి భర్తయు - అత్తయు, నీ పిండిని, కలయంపిని, మొగమునం జల్లిరి. అప్పుడాభక్తుండు "పాండురంగార్పణ"మని పల్కిన కతమున నాశిక్షలు నే ననుభవింపవలసి వచ్చినది.

రాధా—ఆహా! మీభక్తవాత్సల్యమునకు మేరలేదుగదా!

శ్రీకృ—దేవీ! నాభక్తవాత్సల్యము మాటకేమిగాని, సక్కుబాయికి నాయందు గల, యపారభక్తిమాత్రము సంకీర్తనీయమైనది సుమా !

రాధా—మీరు స్వయముగా స్తుతింపదగినంత దృఢభక్తి సమన్విత యగునా ఆసక్కుబాయి ?

శ్రీకృ—నీకు సందేహమేల ! నాతో స్వయముగా వచ్చి యొక్కమారామెను దర్శింపుము.

రాధా—భాగ్యము. [తెర]



# సతీ-సక్కుబాయి

—[ • ]—

## ద్వితీయాంకము

### 1 వ రంగము — కాశీపతి యిల్లు.

### ప్రవేశము—పిండివిసరుచున్న సక్కుబాయి.

సక్కు—రంగయ్యా - నా పాండురంగ విఠలమూర్తీ! అత్తగారు నిన్న నాలోనుండి వేఱుపరచి యెందో పారవేసినది. నిన్నటి నుండియు నీకు నివేదన శూన్యమయ్యెగా! నాతండ్రీ! నీ కాఁకలి యగుచున్నదా స్వామీ! అయ్యో! నే నేమి చేయుదును! పాపాత్మురాలను! నిన్ను నావద్దఁ స్థిరముగా నుంచుకొనుట కైనను స్వతంత్రము లేనిదాన నైతిని! నీకు నేటిదినము లేదని, నీతోపాటుగ తిండిమానుట కన్న, నేను చేయఁగల్గిన దేమియును లేక పోయెను. తిండి మానుకొంటిననియే గదా నాతండ్రీ! అత్తగారు ఉదయమున, నన్నన్ని దెబ్బలు కొట్టిరి! - రాత్రియంతయు కంటిమీఁద ఱెప్పవేయకుండ పిండి విసరితిని! ఈ కుప్ప యింకను పర్వతమువలె నున్నది! ఎన్నడు తరుగును? ఎట్లు తరుగును? - మానవమాత్రుల కిది సాధ్యమైన కార్యమా? - ఐనను, దివ్యప్రభావ భాసురుండ వైన నీ కనుగ్రహమున్నయెడల నన్ను రక్షింపలేక పోవుదువా?

సీ. అలనాడు సభలోన హా కృష్ణయను కృష్ణ
మానంబు గావవే! మానసీయ!—
చాలపాపనిభక్తి పాశంబులకుఁ జిక్కి,
కంబంబునందునఁ గట్టువడవె!
గజరాజు మకరిచే—గాసిల్లి నిను వేఁడ,
నక్రంబుఁ గూల్పవే చక్రధార!
పిడికెడు నడుకుల పేదకుచేలుని
మనుపవే! బహుళసంపదలచేత
ఆర్తులగు భక్తులను బ్రోతువనుచు నీకుఁ
గంకణముగల్గదే! యకళంక మూర్తి!

మఱచితే? భక్తవాత్సల్యపరత నీవు
కష్టమా? చిన్నికృష్ణ! నాకష్టమార్పు. ౧౫

ఆపద్బాంధవా! నాయనా! నా పాండురంగమూర్తీ! నామొరాలకింపవా?—

ఉ. ధీరతరోపవాసమున, దేహబలంబుగతించె నిన్న నే
హారము నీరమున్ విడిచినందుకు తోడుగ నిద్రలేదు; ని
ష్ఠారతచే, కరంబులను జాలగ బొబ్బలుపుట్టె, నింక నే
తీరున పిండిచేయఁగల? తీరనిధాన్యపురాశి! శ్రీహరీ! ౧౬

అయ్యయ్యో! చేతులఁ బొడసూపినబొబ్బలు చిదికి నీరుగారఁ జొచ్చినవి! పుండ్లుపడిన చేతులతో నెట్లు తిరగటిం ద్రిప్ప నేర్తును?......అమ్మయ్యో! ఆవల కోడి కూత నాశ్రవణముల కతి భయంకరముగా వినఁబడుచున్నది! అత్తగారు నా శరీరముపై మోదిన కొరడా దెబ్బల చారికలవలె తూరుపుకొండలపై తెల్లని చారికలు కనఁబడుచున్నవి! క్రోధఘూర్ణాయమానమగు నెఱ్ఱని మొగముతో సూర్యదేవునితో పాటుగా మాయత్తగారను అరఘడియలోనిక సాక్షాత్కరింపఁగలదు. అరగడియ కాలములో అనంతమైయున్న యీధాన్యపురాసిని నేను విసరగలనా? అయ్యో! విసరకున్న నెట్లు? విసరనైన విసర వలయును! దెబ్బలతో నేను చావనైనఁ జావవలయు! చచ్చుటకు భీతిల్లనుగాని, అత్తగారియాజ్ఞ నతిక్రమించిన పాపమును మూటగట్టుకొని చావవలయును గాబోలు. అరచేతులు బొబ్బలెక్కినను సరియే! మఱియేమైనను సరియే — శక్తివంచనలేక, సాధ్యమైనంతవరకు నాదోషములేకుండ విసరెద గాక! [కొంతసేపు విసరి యలసటనందె] అబ్బా! గూడలు పగిలిపోవు చున్నవి. అరచేతులు మండిపోవు చున్నవి! కన్నులు మూతలు పడుచున్నవి! బడలికచే శిరస్సు గిర్రునఁ దిరుగుచున్నది!— ఇంకేమి చేయుదును! — పాండురంగా! ఆపద్బాంధవా! ఇప్పట్టున నీకన్న నాకు శరణం నాస్తి. నీపాలఁబడినదానను!! ఏమి చేసినను నీదేభారము!—

మ. కరుణాంభోనిధి అత్తగారును, మనశ్శాంతుండు నేతెంచి, ని
ష్కరుణన్ గొడ్డునువోలె గొట్టెదరు కృష్ణా! నన్ను నాజీవమున్
త్వరలోఁబాపి, త్వదీయ దివ్యపదముం బ్రాపింపఁగా జేయుమా!
శరణం నాస్తియటంచు వేడితి పరేశా! భక్తచింతామణీ. ౧౭

[ మూర్ఛిల్లును ]

[రాధాకృష్ణులు ప్రవేశము]

కృష్ణ... దేవీ! అదే నాభక్తురాలు సక్కుబాయి! భక్తిపారవశ్యమున, నెట్ల మూర్ఛాగతయై పడియున్నదో — కనులారఁ దిలకింపుము!

ఆ. వె. మూడునాళ్ళనుండి భోజనంబు త్యజించి
యున్నదీ లతాంగి నన్నుఁగూర్చి -
పిండివిసరలేని బెంగ నిద్దురమాని
యుండి నన్ను స్మరించుచున్న దిపుడు.

రాధా—పిండి విసరజాలనంత మాత్రమున నిద్రగూడ మానవలసినంత బెంగ యూమెకేలఁ గలుగవలయును ? అందువలన నీ భక్తురాలి కెట్టిబాధయైనఁ గలదా?

కృ—బాధగలదా యని యడుగుచున్నావా ?

సీ. చుప్పనాతికి నగ్రసోదరి తాటక
కెనయౌ కలహావేత్త యీమెయత్త
"దున్నయీనిన" దన్న దూడనుగట్టెద
నేదీ?" యనెడు మూర్ఖుఁ డీమెభర్త—
ప్రొద్దుండగాలేచి, యెద్దుపోలిక నెంత
యీడిన్ఁ దీరని యింటిపనులు—
కల్ల నేరము లిచ్చకంబునకై నూరి
పోయువార లిరుగు పొరుగువారు—
సంతతము నన్ను స్మరియించు సక్కుబాయి,
చూచి యోదార్చువారు మచ్చునకులేరు;
కష్టమేకాని సతికి సౌఖ్యంబుగలదె?
సహనముల దీవిగాదె! యీ సక్కుదేవి?—

నిన్న సాయంకాల మీమె యత్తగారు, ఉపవాసముచే శుష్కించి నీరసించి యున్న యీ సక్కుబాయికి ఇరువది మానికలధాన్యముం గొలిచియిచ్చివీనిని తెల్లవారు వరికి పిండి విసరుమని యాజ్ఞాపించినది.

రాధా—ఏమేమీ ! ఇరువదిమానికల ధాన్యమా? పండ్రెండుగంటలలో విసరుదురయా ? మానవులకు సాధ్యమగునా యీపని ?

కృష్ణ—పాపము గతరాత్రియెల్ల నిద్రమాని చేతనైనంతవరకు విసరినది. ఈ భక్తురాలిచేతులు చూడుము. బొబ్బలెక్కి - చిదికి పుండ్లుపడి యెంత బీభత్సముగ నున్నవో! – అప్పుడే తెల్లవారవచ్చుచున్నది. అత్తయును భర్తయు, యమదూతల వలె నిచట వచ్చిపడి పిండి విసరలేదని యీమెను దండింతురు!–

రాధా—నాథా! భక్తురాలి కింతటి మహాకష్టము ప్రాప్తియుండఁగా – మీ రింక నేల యుపేక్ష సేయుచున్నారో నాకు విస్మయప్రదముగ నున్నది !

గీ. తండ్రియైనఁ బ్రేముడిఁ గన్న తల్లియైన—
నెట్టిబాంధవులైన మీరే యటంచు
భక్తి, నిను నమ్మదుపుగదా భక్తజనులు—
ఇట్లు పేక్షజేసిన వారి కేది దిక్కు!—

కృష్ణ—రాధా! నా హృదయమున కఖిలావంగూన్చు తత్త్వము నీవసయిత మింతవరకు దురవగాహముగనే యున్నట్లున్నది. చూడు—

గీ పుటములో గాలిలు స్వర్ణంబువోలె, సతత
కష్టతతులచే స్థిరభక్తి గల్గినపుడె,
భక్తులయశంబు ప్రళయంబువరకు నిలచు,
తరుణ మొఱఁగి, వారల యాపదలనుఁ దీర్తు.

ఈ సక్కుబాయికిఁగల్గిన స్వల్పకష్టమును నేనొక లిప్తమాత్రమున దీర్తును. ఈ చిత్రమును జూచుచుండుము! - (చేతితో గంపను దాకగా, ధాన్యమంతయు పిండియగు చున్నది.)

రాధా—(నవ్వి) జగన్నాటక సూత్రధారులకు తమరు సంకల్పించిన పిదప జరుగని కష్టకార్యములుగూడ నుండునా? అమ్మయ్యా! ఇప్పటికి సక్కుబాయి కష్టమును, నాహృదయాందోళనమును గూడ నణగిపోయినవి.

కృష్ణ—దేవీ! తూర్పుదిక్కునఁ బరికింపుము! అరుణోదయమైనది. అనతికాలమున నే సూర్యోదయముగూడ కాఁగలదు. ఇంక సక్కుబాయి యత్తయు భర్తయు నిటు వత్తురు. భక్తురాలును మేల్కొనును. మన మిఁట నుండరాదు. పోవుదము రమ్ము—

(ఇరువురు నిష్క్రమింతురు)

సక్కు...(అందోళనతో మేల్కొని) కృష్ణా! కృష్ణా! రాధాకృష్ణా! పోబోకుము! దీనురాలను నీపాదదాసిని! నన్నువదలి పోబోకుము. రాధామాయితోఁగలసి వచ్చి రహస్యములాడుచుండిన వాఁడ వింతలో నెంచుబోయితివి! నాతండ్రీ! నాకుఁ గాన్పింపవా? నేనేమి పాపముచేసితిని? అదిగో! అదిగో! ఇంకను నాశ్రవణములకు — సుధామధుర మధురమగు నీ మురళీ నినాదము మెల్లని పిల్లవాయువులతోఁ గలసి వినఁబడుచునే యున్నది! నన్నాటలాడించుటకు, నన్ను శ్రమపెట్టుటకు, ఇందే యెందైన దాగియున్నావా?

సీ. మోహానంబైన నీమురళీ నినాదమ
ల్లదిగో! శ్రవణ పర్వమగుచునుండె;
పారిజాత సుజాత పరిమళయుత గంధ
మల్లదిగో! మెలమెల్లఁబోచె;

శంఖచక్రాంకిత చరణ చిహ్నములివే—
వచ్చిపోయినదారి వరుసఁజూపె;
సీతోడ ననుగూర్చి నాతల్లియాడిన
పలుకులింకను చెవిఁబాయకుండె;
ఇంతలోపల నెందుఁ బోయితివి తండ్రి!
పాపినగు నాదుకన్నుల బడవ? కృష్ణ!
క్షణములో, సత్యమగుదాని స్వప్నలీలఁ
జేసి, నీమాయచేఁ గప్పివేసినావె? ౨౨

[అనుబంధము]

( అత్త ప్రవేశము )

అత్త...ఓసి నీయిల్లుకల్లకాదుగాను. మూఁడురోజులనుంచీ కూడూ నీళ్ళు లేకున్నా - ఎంతసత్తువతో ఎగురుతున్నావే? పుట్టినబుద్ధిపుల్లతోఁగాని, నిన్ను వొదిలేటట్టులేదేమే? ఎన్నికొట్టినా, ఎఁతగడ్డిపెట్టినా - నీకెందుకు బుద్ధిరాదూ అంటు! - పిండివిసిరావా? - మొద్దువలె తెల్లపోయి చూస్తావెందుకూ!— ఏదీ! ఇదేనా పిండి! తిరగఁటిదగ్గర పిండే కనబడదేం! ఇట్లా ఎగురుల్లాడుతూ వుంటే నీకు పిండివిసిరే తీరికగూడా యెక్కడోస్తుందీ! (కొట్టును)

( కాశీపతి ప్రవేశము )

కాశీ—(స్వగతము) బంగారంవంటి నిద్ర బండలై చక్కాబోయింది! తెల్లవారిందోలేదో? అల్లరి మళ్ళీ ఆరంభం - (ప్రకాశము) ఏమిటమ్మా! తెల్లవారకముందే ఇట్లుతింటూంది? ఏం జేసిందేమిటి?-

అత్త—ఏం జేసిందా? నాపిండాకుడు చెసింది! తెల్లవారేవరకు, పిండివిసిరి సిద్ధంగావుంచమంటే, నామాట ధానికక్కరోషంతో సమానంగా కట్టిపేసి-మామూలు ప్రకారంగా దాని ఆటలేవో పాటలేవో యెగురులాడుతుంది. మూడురోజులనుంచీ కూడులేకుండా ఎగిరి గంతు లెయ్యటానికి బలముందిగాని పిండి విసరడానికి బలం లేదూ?

కాశీ—(గంపలోచూచి) ఇదుగోనమ్మా గంపెడుపిండి విసరి పెట్టింది! పాపం! విసరలేదంటావేం?

అత్త—ఎక్కడ విసిరింది? గంపెడుపిండి? ఏట్లో - [గంపనుచూచి] నిజమేరా! ఇరవైమానికలపిండీ విసిరింది! ఇంతబలమెక్కణ్ణుంచొచ్చింది దీనికి? దీని సంగతంతాచూస్తే నాకు పరమాశ్చర్యంగా వుందే!

కాశీ—మటి - ఎట్లావినురుతుందనుకుని ఇరవైమానికలపిండి విసరమన్నావమ్మా! పాపం తెల్లవారులూ మేలుకొని ఏదోవిధంగా విసిరి అక్కడబెడితే, ఆశ్చర్యంగావుం దంటావు! విసరకుంటే దెబ్బలు తప్పవుగదా!

సక్కు—(స్వగతము) పాండురంగా! నీపరమాశ్చర్యలీల నీకే తెలియవలయుం. గాని—బ్రహ్మాదులకు సయితం అగోచరముగదా తండ్రీ!

అత్త—తెల్లవారులూ మేలుకుంటేమాత్రం అంతపిండి విసరటం సాధ్యమౌతుందటరా?—అస్తమానం ఆటలూ పాటలతో ప్రొద్దుగడుపుతూవుంటుందని తరగని పని పెడదామని యిరవైమానికలు విసరమని ఊరికే అన్నానుగాని నేనుమాత్రం విసరలేదని ఎఱుంగనటురా! దీన్ని—ఏదో దయ్యం బట్టిందిరా! లేకపోతే, మూడు రోజులనుంచీ కూడులేకుండా వుండటమేమిటి? ఇరవైమానికలపిండి విసరటమేమిటి? ఇల్లంతా ఎగురులాడటమేమిటి? తప్పకుండా దయ్యమేరా! నాయనా! దయ్యమేదీన్ని దయ్యం బట్టింది!

కాశీ—(అదరిపడి) అమ్మయ్యో! దయ్యమే! నిజంగా దయ్యమేనటమ్మా?

అత్త—దయ్యమేరా! దయ్యమే! నేను నీతో అబద్ధమాడుతానటరా వెఱ్ఱి నాయనా!

కాశీ—నాకు దయ్యంపేరుచెపితే, తగనిభయమమ్మా! ఈదయ్యం కొంపలోంచి వొదిలే వుపాయం వున్నదా లేదా చెప్పు. లేకుంటే నేనీకొంపలో, క్షణమైనా వుండను, ఎక్కడికైనా పారిపోతాను!

అత్త—నువ్వులేచిపోవడమెందుకురా? ఈదయ్యాన్ని నేనొక క్షణములో వదలగొడతాను. చూస్తూవుండు!

కాశీ—ఎట్లా వొదలగొడతావూ?

అత్త—గరిటెకాల్చి — నాలుగువాతలు వడ్డిస్తినా - దయ్యంకాదుగదా దయ్యంతాతగూడా వొదిలి చక్కాబోతుంది!

కాశీ—నిజంగా కాలుస్తావటే అమ్మా!

అత్త—కాల్చకుంటే యీదయ్యం వొదిలేదిగాదురా!

కాశీ—కాలిస్తే చచ్చిపోతుందేమో?

అత్త—ఎందుకుచస్తుంది? వాతలు దయ్యానికిగాని దానికి తగలవురా! నీకీగొడవలన్ని తెలియవు! నువ్వూరుకో! అదిచస్తే నాకుమాత్రం సంతోషమా నాయనా! దాన్నిబట్టినదయ్యం వొదలాలనే తంటాలు బడతానుగాని.

కాశీ—ఐతే నీయిష్టం! ఏదోవిధంగా దయ్యాన్ని మట్టుకు వొదిలేస్తేసరి...... అదేనాకు కావలసింది!-

అత్త—ఎక్కడికి పారిపోకుండా దీన్ని జాగ్రత్తగా చూస్తూవుండు— గంటెకాల్చుకువస్తాను! (నిష్క్రమించును)

కాశీ—(స్వగతం) అయ్యయ్యో! ఆసుకుమారమైన శరీరాన్ని నిజంగా కాలుస్తుందికాబోలు!—నేనేంజేసేది?— (ప్రకాశం) ఇదిగో నాకేసి అట్లా దయ్యంచూపు చూస్తావెందుకు? శరీరంలో ఎట్లావుంది? నిజంగా దయ్యంబట్టిందా?—మాఅమ్మ అబద్ధాలాడుతుందా?

సక్కు—[ఏడ్చుచు] అత్తగారితోబాటుగా, మీరును, నన్ను కాల్చుటకు సమ్మతించుచున్నారా? నాకుదయ్యము పట్టినదనినమాటను మీరునుగూడ నెట్లు నమ్మితిరి? మీరిరువురును గూడ నొకటియై నన్ను పశువును గాల్చినట్లు కాల్చినచో... నిఁక నన్ను రక్షించు వారెవ్వరు? నామొరాలకించు వారెవ్వరు? [కాళ్ళపైఁబడి] జీవితేశ్వరా! నన్నీ మహావిపత్తునుండి రక్షింపుఁడు. మీపాదములే నాకుగతి. రక్షింపరా? రక్షింపరా?

కాశీ...(స్వగతము) ఇంతచక్కగా మాట్లాడుతూంటే - ఇంతకడుపు తరుక్కుపొయ్యేటట్టు - ఏడుస్తూ వుంటే - దయ్యం బట్టిందని యెట్లానమ్మేది? చూస్తూ చూస్తూ ముద్దంటిదానికి ఎట్లావాతలు బెట్టించేది? దీని దుఃఖం చూస్తే నాకుగూడా దుఃఖమొస్తోంది?

సక్కు...నాధా! నాధా! మాటాడ రేమి పాపము? నాగతియేమి చెప్పితిరి? ఒకప్పుడు గాకున్న నొకప్పుడైనను, నన్నుఁజూచి రవంత జాలి పడువారు మీరొక్కరే కదా. అట్టి మీరును, నన్ను దిక్కుమాలినదానినిఁ జేసి వదలివేయుదురా? ఇంక నాకు దిక్కులేదా? నాథుండుగల్గియు నే ననాధను గాకలసినదేనా? పాండురంగఁడే నాకు శరణ్యుఁడా? ప్రపంచకమంతయు నన్నొక్కసారిగా శత్రుభావమునఁ జూచునా? అయ్యో! జీవితేశా! అత్తగారు వచ్చు వేళయైనది నా ప్రార్థనముం ద్రోసిపుచ్చితిరా? నన్నన్యధా చూచెదరా!-నేను మీయర్ధాంగిని గానా! స్వామీ! పలుకరేమి?

కాశీ...ఇదిగో! ఊరుకో ఛీ! ఏడువబోకు కళ్ళు తుడవవా? (తుడుచుచు) నువ్వు నాతో నిజమే చెప్పుతున్నావా? దయ్యం గియ్యం లేదుగదా? నిజమేనా?- ఐతే మరి- మాఅమ్మ అట్లా అంటుందేం?

సక్కు...అత్తగారట్లేల పల్కుచున్నారో నే నెఱుఁగను. నన్ను దయ్యముగాని భూతము గాని యేదియు నావేశింపలేదు.

కాశీ...ఒకటిగాదు - రెండుకాదు - ఇరవైమానికలే! ఏదయ్యమూ నిన్నావేశించకుంటే, ఒక్కరాత్రిలో, ఎట్లావిసిరావా అని మాఅమ్మకు సందేహం పట్టుకుంది! నాకూ అదే అనుమానం - ఏమంటావు? నువ్వే చెప్పు సందేహంగావుండె విషయమంటావా కాదంటావా మరి.

సక్కు...మీచరణసాక్షిగా ఆపిండంతయు నేను విసరలేదు చేత నైనంత విసరితిని—చేతులు బొబ్బలుపొక్కినవి! శ్రీకృష్ణా! నన్నెట్లు రక్షింతువో నీదేభారమున శ్రీపాండురంగమూర్తి యిచ్చటికి దయచేసినట్లు స్వప్నము వచ్చెను. కనులు తెఱచి చూతునుగదా నా కెవ్వరును గాన్పింపలేదు. పిండివిసరుట పాండురంగని మహిమయో గాని, నే నేమియు నెఱుంగను. మీరు నమ్మినను సరియే! నమ్మకున్నను సరియే! జరిగిన యథార్థమిది.

కాశీ...నీ మొగంలే వూరుకో! దయ్యంలేదఁట దేవుడొచ్చి పిండి విసిరి చక్కాబోయినాడఁట! ఎవళ్ళు నమ్మేకథ లివి.

(కాలుచున్న గరిటతో అత్త ప్రవేశము)

అత్త...ఒరే! కాశీపతీ! త్వరగా రారా చేయి కాలుతుంది! దాని చేతులు గట్టిగా పట్టుకో! వీపుమీఁద నాలుగువాతలు వేస్తాను!

కాశీ...నిజంగానే కాల్చి తెస్తావఁటే? అమ్మా!...

అత్త...ఇంకా మాట్లాడుతున్నావఁటరా? త్వరగా దాన్ని పట్టుకోరా మళ్ళీ చల్లారిపోతుంది!

కాశీ...అది పాపం దయ్యమూ భూతమూ ఏమీ లేదని వొక్కవత్తుగా ఏడుస్తుందేమే అమ్మా!

అత్త...దయ్యం బట్టినదాన్ని పట్టుకొని నీకు దయ్యం బట్టిందా అని గడ్డం క్రింద బెల్లం పెట్టి అడిగితే నిజం చెబుతుందఁటరా! అమ్మయ్యో! ఇంత అమాయకపు ముండావాడివేమిరా? శీఘ్రంగా కాల్చివాతలు పెట్టకపోతే యీపిశాచం కొంప వదలి పోతుందంటరా నాయనా! నిన్నో నన్నో పట్టుకొని పీక్కొనితినడం ఆరంభిస్తే ఆనక అణగించలేమురా! త్వరగా దాన్ని పట్టుకోరా.

కాశీ...నిజమేనేవ్! నిజమే నిన్నో నన్నో పట్టుకుంటే మనకు వాతలు వేసే దిక్కుగూడా కొంపలో యెవరూ లేరు! ఇదిగో పట్టుకుంటున్నా! నేను చూడలేను—మొగం అవతలికి త్రిప్పుకుంటూవుగాని, నువ్వు వీఁపుమీఁద అంటించు—

(సక్కు చేతులు పట్టుకొని మొగమావలికి త్రిప్పుకొనును.)

అత్త—(వీపుమీఁద గరిటతో కాల్చును.)

సక్కు—హా! పాండురంగా! రంగా! రంగా! (మూర్ఛిల్లును)

కాశీ—(సక్కును వదలి కేకలు గంతులు వేయుచు) అబ్బా! చంపావుగదే! చంపావుగదే! నీకేం పెద్దరోగంబుట్టిందే! దాన్ని కాల్చబోయి నన్ను కాల్చావేమే నేనేం జేశానే! అమ్మో! నాయనో! మంట! మంట! (క్రిందఁబడి కొట్టుకొనును)

అత్త—అయ్యో! నాతండ్రీ! నాతండ్రీ! నీకేమి బాధరా నాయనా! నిన్ను కాల్చలేదురా! దాన్నే కాల్చానురా! నా చేతులు పడిపోనూ! ఎంతదుర్మార్గపుముండనైనా నిన్ను కాలుస్తానఁటరా! ఎక్కడరా నాయనా! నీకు బాధెక్కడరా తండ్రీ!

కాశీ—అబ్బా! అమ్మా! మంట! నఖశిఖపర్యంతం భగ్గున మండుకుపోతుంటే! రాక్షసిముండవు! నన్నే కాల్చావే! వీపుమీఁద చూడవే! అబ్బా! అయ్యో! అమ్మో!

అత్త—దాన్ని పట్టిన దయ్యం చేసిన మాయరా యిది! నాయనా! నేను నిన్నెందుకు కాలుస్తానురా! అయ్యయ్యో ఇదెక్కడి మాయదయ్యం దాపురించిందమ్మా! మాకొంపలోకి— పక్కాబాయమ్మ తల్లీ! ఓదయ్యాలపోతు పెద్దమ్మతల్లీ! నీమూలాన్ని నాకొడుకేడుస్తున్నాడు! ఏ అమ్మారే! ఇంకనైనా రే!—ఎక్కడరా నాయనా బాధ! వీపుమీఁద విసరనైనా విసురుతానుండు!— (వీపుమీఁద విసరును)

సక్కు—(లేచి) అత్తగారూ! అత్తగారూ! ప్రాణేశ్వరున కేమి వచ్చెను! ఎందులకట్లు బాధపడుచున్నారు! నాథా! నాథా! (సమీపించును.)

అత్త— ఏం! పెద్ద ముద్దులాగ, అత్తగారూ — అత్తగారూ అని చిలుక పలుకులు పలకొచ్చావు!—పో! పో! దయ్యాలపోతుమురండా. దూరంగా పో!

సక్కు—అత్తగారూ! మీపాదములు బట్టి వేడుకొందును. నన్నెన్ని కొట్టినను సహింతును. భర్తగారి బాధను గాంచి సహింపజాలను, వారికేమైనదో కొంచెము చెప్పరా, అత్తగారూ, చెప్పరా, చెప్పరా. —

అత్త—ఊఁ ఏమొచ్చిందా. నువ్వింకా ఎందుకు చచ్చావు గావని ఏడుస్తున్నాడు.

సక్కు—పోనిండు, వారు క్షేమముగా నుండిన నాకంతే చాలును, నేను చచ్చుటకు సంశయింపను.

అత్త—అబ్బ, అబ్బ, ఎంత నంగనాచివే, నువ్వింతట్లోనే చస్తావా అమ్మను తల్లిని, మహామారివలె కొంపకు దాపురించావు, మా అందరి ఆయువూ పోసుకొని వెయ్యేళ్లూ బతుకుతున్నావు. నువ్వెందుకు చస్తావు. చస్తే మాకనే విరగడైపోవును.

సక్కు—అమ్మయ్యో, పాపాత్మురాలను నాకు చావురాకున్నదిగదా, రంగా.

అత్త—అబ్బాయీ, అబ్బాయీ, ఎట్టావుందిరా నాయనా

కాశీ—అబ్బబ్బా, వంటి మండుతూంది.

కాశీ—ఎవరు ఎవరిదీ అయ్యో, రాక్షసీ, నువ్వేనా, పో, పో, దూరంగాపో. దాన్ని రమ్మను—సక్కును విసరమను— చల్లగా వుంటుంది—

సక్కు—నాథా, నాథా, నేను వచ్చితిని. [విసురుచున్నది.]

అత్త—నీతలపండు పగల, నీకేం మాయతెగులు ముంచుకొచ్చిందిరా, దాన్ని పట్టిన దయ్యమే నిన్నూ పట్టిందంటరా. నీకుగూడా నాపాడ గిట్టకుండా పోయిందిరాఁ ఇద్దరూ కలిసి, కట్టగట్టుకుని గంగలో దిగండి. చావండి నాకెందుకు.

[ దుమ దుమలాడుచు నిష్క్రమించును ]

సక్కు—నాథా నాథా కొంచెము మంటతగ్గినదా, చల్లనిగాలి వచ్చుచున్నదా.

కాశీ—ఆఁ చల్లగావుంది. బాధంతా మాయమైపోయింది. ఎవరు విసిరేది నువ్వేనా సక్కూ.

సక్కు—నాథా నేనే—శరీరమున మీకెట్లున్నది. ఈ మంటలేల గల్గెను, ఈ బాధ యెట్లు వచ్చెను.

కాశీ—నీకింకా తెలియనేలేదూ—సక్కూ ఎవరిపాపం వారినే కొడుతుంది సుమా. నీకు దయ్యంబట్టిందని, మాఅమ్మముండ నీకు వాతలు బెట్టబోయి నాకు బెట్టింది. గుడ్డిముండ—

సక్కు—నాథా, అత్తగారు పాపమే పాపము నెరుంగరు. అకారణముగ వారినేల దూషించెదరు. వారు నాకే వాతలు బెట్టిరి. నన్నే కాల్చి. ఆవాతలవలన నా శరీరమునకు వేడి యెంతమాత్రమును తగులలేదు. చందనలేపనమువలె చల్లగా నుండెను. ఆ బాధ మీకు గల్గుటయు పాండురంగని మహిమవలననే సుండీ. ఇంక మీకెట్టి బాధయు గల్గకుండ రంగడు మిమ్ము రక్షించుగాక.

కాశీ – ఆహాహా! నిజమేసుమా సక్కూ. నీమాట సత్యవాక్కుసుమా. ఆమాట నీనోటివెంట రాగానే, అంతబాధా – ఆంతమంటా – ఏమైపోయిందో, తుడిచివేసినట్లు మాయమైపోయిందిసుమా. ఆహా రంగనిమహిమ.

సక్కూ—స్వామీ రంగని మనసార నమ్మినవారి కేనష్టములును గల్గవు సుమండీ. మన కందరకును రంగఁడే దిక్కు.

సీ. కాలకింకరులైన గడగడ వణకరే
పాండురంగని భక్తవరుల డాయ
దావాగ్నియైన చందన శీతలముగాదె
పాండురంగని భక్తవరుల యెడల
భూతపిశాచ సంఘాతంబు వెఱవదే
పాండురంగని భక్తవరులఁ గాంచి
మారీభయంకర రామయములు తొలఁగవే
పాండురంగని భక్తవరులనుండి
దారుణవిభంబయిన నమృతంబుగాదె
పాండురంగని నిజభక్తవరులయందు
రంగనామము మీఱు మంత్రంబు గలదె ?
జగతి రంగనామాధికౌషధము కలదె ! —33

కాశీ – ఇన్నాళ్లనుంచీ, రంగడి మహిమ – మహిమ – తెలిసికొన లేకపోయినాను. నీవు నా భాగ్యలక్ష్మివే సక్కూ. (కౌగలించుకొనును)

( తెర వ్రాలును )

ద్వి తీ యాం క ము



# పతి-పక్ష బాంధ

## తృతీయాంకము

—[ ♦ ]—

రంగము 1 – కాశీపతి యింటిముందు వీధి.

(ప్రవేశము – శంభుశాస్త్రి (ప్రయాణ వేషముతో)

శంభు—వీడిమీద బండబడ! వీడితో ప్రయాణమంటే ఎప్పుడూ యింతే. గంపెడుచీకటి నెత్తినివేసుకొని ఊరుదాటి కదిలి అవతలపడితే భోజనంవేళకు పది క్రోసుల ప్రయాణమైనా సాగునా? అప్పుడే తెల్లవారి సూర్యోదయంగూడా అయింది ఇప్పటికింకా జాడా జవాబుకూడా లేదు. సూర్యభగవానుడికన్నా తీరుబాటయిందిగాని మా సూరిశాస్త్రిగారికి తీరుబాటేలేదు. ఈ పండరీ పురానికి మార్గం తెలియక, వీడితోడుకోసం ఆశపడ్డాను గాని – దారే తెలిసిఖుంటే యీపాటికి రెండు మూడు క్రోసులు తగ్గిపోకుందునా? ఏమిటో — నాచాదస్తంగాని, యీ మహా యాత్రరోజుల్లో వేనవేలు యాత్రికులు వెళుతూంటే — ఎవరితో వెళ్ళితే కాకపోయింది! సూరిశాస్త్రి సూరిశాస్త్రి అని చూరుపట్టుకొని ప్రాకులాడడం కన్నా వెఱ్ఱితనముందా? ఇంక ఆలస్యంచేసేవాణ్ణిగాను! మెల్లగా నడుస్తూవుంటూ – తోడు – దాసి నిగదరగా – అదే దొరుకుతుంది !......... – అదుగో ! ఎవరో వస్తున్నారే సూరిశాస్త్రి కాడుగదా!—

[పెద్దిశెట్టి ప్రయాణవేషమున ప్రవేశము]

పెద్ది—అదిగో! అదిగో నాయిల్లు బంగారమైతే శంభుశాస్త్రుల్లుగారు గామాల్సె లాబాలే ! లాబాలు! చాత్తుర్లుగారూ! దండాలండి !

శంభు—ఓహో! పెద్దిశెట్టిలా గున్నాడే!

పెద్ది—పెద్దిసెట్టిలాగుండటమేంటి? శాత్తుర్లుగారూ! పెద్దిసెట్టినే -

శంభు—ఎందాకా ప్రయాణం పెద్ది సెట్టీ?

పెద్ది—తమ రెందకా బాబూ ?

శంభు – ఎంతచెడ్డాపావుకారు బిడ్డననిపించావు. ఎదటిమనిషిగుట్టు తెలుసుకోకుండా చస్తే – నీ గుట్టివ్వవుగా? పోనీలే ఇందులో రహస్యం మాత్ర మేముంది ? నేనే చెపుతాలే. పండరీపురంలో జరిగే పాండురంగడి వుత్సవాలకు యాత్రవెళుతున్నాను. మరి నీ ప్రయాణ మెక్కడిదాకా ?

పెద్ది—పండరిపురమే ఐతే పదండి బాబూ! నాయిలు బంగారమైతే నేనూ పండరీపురానికే !

శంభు - ఓ! ఐతే యింకనేమి! నేను నక్కని దొక్కావన్నమాటే! కోమటిని వెంటనుంచుకొంటే కోటిరూపాయలు వెంటవున్నంత ధైర్యం ! యాత్రలో ఐదూ పదీ తక్కువబడ్డా నీయంతవాఁడి సాయముండఁగా నాకేం భయం !

పెద్ది—సరి సరి లెండి! నాయిల్లు బంగారమైతే నన్నే నమ్ముకున్నారటయ్యా ! ఎర్రిచాత్తుర్లగారూ ! నాకాడ - నాకాడేముందిబాబూ ! శంభుచాత్తుర్లుగారు కనబడ్డా రంటే - సగం బల మొచ్చినట్లయింది. ఎనక తమరింటో - బారసాలనాడు బట్టలు వాడుకున్న తాలూకు సిల్లరో కొంతైనా యీ ప్రయాణములో సర్దకపోతారా అనుకుంటున్నా - చానాళ్ళయింది. ఆసిల్లరనకపడిపోయింది. సదువుకున్నోళ్ళని పీటికి మాటికి అడగటం బాగుండదని అడగలేదు. "ఇప్పుడుమాత్రము ఏం తొందరొచ్చిందని అడిగావు సెట్టీ" అని చెలవిత్తారేమో ! ఓయ్ — ఏదో యాత్రప్రయాణంగదా అండి! డబ్బు నిక్కచ్చిరోజులుగదాండి! తమ రెఱగని దేముంది శాత్తుర్లుగారూ ! కాస్త యీ తర్నోమాత్రం యెనకటి సిల్లరబాకీ మాట కూంత గ్యాపకముంచుకొని, సెట్టినోక కంట గనిపెట్టాలి మతి !

శంభు—ఊహూఁ - అప్పుడే ముందరికాళ్ళకు బంధం తగిలించావూ! ఎంత వాఁడవోయ్ సెట్టి ! పోనీ! నువ్వు నాకేమీ సర్దనక్కరలేదుగాని, ఆ పాతబాకీ మాత్రం యాత్రలో వసూలుచేయబోకు! నేను ప్రయాణపుఖర్చులుదప్ప అధికంగా యేమీ తేవటంలేదు.

పెద్ది—తమసిత్తం - నాబాగ్గెం - పోనీయండిగాని, శానాళ్ళయింది! అట్టే యెనక బడనియ్యబోకండి! యాత్తరనుంచిరాంగానేమాత్రం చుక్తాచేయించండి.

శంభు - పెద్దిసెట్టీ! పాండురంగా పాండురంగాఅని స్మరణజేస్తు యాత్రకు బోవలసిన సమయంలో పాతబాకీ పాతబాకిఅని ప్రాకులాడతావెందుకూ? మనస్సంతా డబ్బుమీదే వుంచుకుని యాత్రకు వచ్చిన ఫల మేముంటుంది ?-

పెద్ది—పిలాట కెక్కడికి లెండి? ఇదుగో! శాత్తుర్లగారు! నాయిల్లు బంగారమైతే యవ్వారపు రహస్యమొక్కటి సత్తెమైనమాట చెపుతా వినండి. కోమటోఁడు తీర్తమెళ్ళాఁడంటే, భక్తికోసం, దేవుడుకోసం యెల్తాడంటయ్యా ! పదిదేశాలనుంచి పదిసరుకు లమ్మకానికొత్తే... లాభసేరాన్ని సరుకు దొరికితే అదే పదివేలని ఆ పేద్ద పడతాఁడు అంతేకాని, ఆయువు మూడేటంత నిక్కచ్చికొస్తేనే తప్ప, దేవుఁడిగోలా దెయ్యంగోలా మాకెందుకు బాబూ ! పచ్చుల్లిపాయలమ్ముకొనేవోళ్ళం......

శంభు—భేష్! నిజమైనమాట జెప్పేళావోయ్! సెట్టి! ఏట బడ్డకోమటి నష్టాన పోఁడా అంటూ రిదేకాబోలు !

పెద్ది— కబుర్లతోటే, తెల్లారింది ! కాలుసాగనియ్యండి

శంభు— మా సూరిశాస్త్రుర్లొస్తున్నానన్నాడోయ్! ఇంకారాకుండా వున్నాడని చూస్తున్నాను.

పెద్ది—చూరిశాస్తుర్లా! ఆయ నెక్కడో స్తాఁడు! ఎయ్యాళ్ళు పూజారి! వొత్తే రొమనకొడ్తాఁడులెండి. పదండి.

శంషు—ఉండుడు, ఎక్కడో - తాళాలు|మద్దెళ్ళ చప్పుడు వినపడుతూంది!

పెద్ది—చునూరి భజనమేళంగా దంటయ్యా, ఆప్పుగూడా పండారిపురమే ఎల్తున్నట్లుంది!

(కొందఱుభక్తులు భజనసేయుచు ప్రవేశింతురు)

శంభు...ఐతే: ఆ సమూహంతో కలిసిపోదాం! ఉండు...

(అనుబంధము 4)

(సక్కుబాయి ప్రవేశము.)

సక్కు...(స్వగతము) ఓహో!...పాండురంగ నామసంకీర్తనము శ్రవణపర్వముగా వినబడుచున్నది.

ఆ. పాండురంగ భక్తి పారవశ్యమున "శ్రీ
రంగ! పాండురంగ! రంగ!" యనుచు,
భజనలందు మున్గి పండరీపురి కేగు,
జనము లెట్టిపూజ సలిపినారొ!...

పరికాళముగ పుణ్యాత్ములారా! మీ ప్రయాణమెక్కడికి?

1 భక్త...అమ్మా! పండరిపురమున శ్రీ పాండురంగని దివ్యోత్సవములు జరుగుచున్నవి. మే మా యుత్సవములను సందర్శింప నరుగుచున్నాము.

సక్కు...అయ్యా, నేనును మీతో పండరీపురికి రావచ్చునా?

1 భక్త—అమ్మ! అందులకు మాయాజ్ఞ యెందులకు? భగవంతుని దర్శించుట కొకరి యానతి కావలయునా? అవశ్యముగా రమ్ము.

పెద్ది—చెంబుశాత్తుర్లుం గారూ! ఈయమ్మ కాశీపతిగారి భార్య గాదంటయ్యా!

శంషు—ఔను! కాశీపతిభార్యే! సతీ సక్కుబాయి! మహాభక్తురాలు!

పెద్ది— బక్తురాలో పాడో— ఆదెంతా కిట్టిపెట్టవయ్యా! ఆమె అత్తగారు మా పెద్దది. ఈ చక్కుబాయిని మనం తీసి కెళ్లామని తెలిత్తే శెమ్మరాకాసిలాగ మనలనందర్ని గొంతుకలు కటుక్కున కొరుకుతుంది. మన కెందుకీ గోల! పదండి... పదండి....గాలికిబోయ్యేకంప కాలికిదగిలించుకుంటా రెందుకు?

1 భక్త—అమ్మా! నీచరిత్రమేమో, ఆశ్చర్యకరముగా నున్నది, మీయత్తగారసాధ్యురాలఁట! ఆ కారణముగ నీకై యామెతో మాకు విరోధమెందులకు? మీయత్త గారి యాజ్ఞగైకొని నీవు రావచ్చును. మేము, మెల్లగా సాగిపోవుచుందుము.

[ అనుబంధము 4 ]

(సక్కుబాయితప్ప అందరును నిష్క్రమింతురు.)



సక్కు—(వైరాగ్యముతో, స్వగతము) హా! పాండురంగా! ఈనిర్భాగ్యురాలికి నీ సందర్శనభాగ్య మీజన్మమున ననుగ్రహింపవా ?

సీ. గరుడధ్వజంబుతో గగన మంటెడు నాల
యపుగోపురము దూరమందె కాంచి.
“పాండురంగా యని ప్రణమిల్లి చంద్ర భా
గాతీర్థముల నవగాహమంది,
అడుగడుగునకు “రంగా రంగ రంగా” య
టంచు సోపానము లన్ని గడచి,
పటు కోటి సూర్యప్రభా మోహనంబగు
త్వన్మూర్తి దివ్యపాదముల కెరగి,
భక్తి మేర మీర పారవశ్యము నంది,
తావకీన సన్నిధానమందె,
ప్రాణపంచకంబు వదలి దేహవిముక్తి
గాంచుదివ్యపదవి గల్గు టెపుడొ?

(జ్ఞానయోగి శిష్యులతో ప్రవేశము)

[ అనుబంధము ]

సక్కు—(స్వగతము) ఏమి నాభాగ్యము ! మహాత్ముఁడగు జ్ఞానయోగీంద్రుని దర్శనంబబ్బెను!—(ప్రకాశముగ) మహాత్మా ! తమరును పండరీపురయాత్రకే చనుచుంటిరా ?

జ్ఞాన—అమ్మా! నిక్కముగా గ్రహించితివి! నేనును, పండరీపురమునకే చనుచున్నాను.

సక్కు—స్వామీ! యీ పాపాత్మురాలిని మీవెంటఁ గొనిపోవరా? శ్రీపాండురంగవిఠలుని దివ్యసందర్శనము చేయింపరా ?

జ్ఞాన—అమ్మ—సర్వమును భగవదిచ్ఛానుసారము ! దయచేయుము. దేవదేవుని దర్శింప సర్వజనులకును సమమైన యధికారము గలదు గదా—

సీ. ఇలలోన జీవుల కెల్లవారికి వాయు
సేవనంబున కెట్లు స్వేచ్ఛ గలదొ!
పానీయములు సర్వమానవకోటికి
త్రావ నెట్టుల స్వతంత్రంబు గలదొ!
సకలమానవులకు జ్ఞానామృతము గ్రోలు
నదనున నేరీతి హక్కుగలదొ?

ప్రిజల కందఱకు, స్వారాజ్య సౌఖ్యంబుల
కిమ్మహిం నెట్టి స్వామ్యమ్ము గలదొ
యట్టులే, లోకనాథుండౌ నాదిదేవు
భవ్యసందర్శన ధ్యాన భజనములకుఁ,
గలుగఁగల దట్టిదే యధికారబలము,
పెద్దలెల్లరు పెరుమాళ్ళ పెండ్లి కనరు!—

( అత్త ప్రవేశము )

అత్త—ఓసి నీశార్థం చెట్టుక్రింద కెట్ట, ఓసి నీపిండాకూడు పిల్లులకు కెట్ట! మళ్లీ మాకొంపకు దాపురించావురా,— ఓసి దిక్కుమాలినదానా ! ఓసి దరిద్రగొట్టు పెద్దమ్మా నువ్వు సంసారివా? సానివే!— ఆ బికారివెధవతో వద్దన్నకొద్దీ గుసగుసలేమిటే నీకు? ఒరే! నాయనా! కాశీపతీ, మళ్ళీ కొంపకు చేటుకాలంమూడిందిరోయ్!—నీభార్య వీడితో లేచిపోతుందిరోయ్! ఇంకేముందిరో బాబూ...

( కాశీపతి ప్రవేశము )

కాశీ—ఏమిటమ్మా, - ఎవఁడు? ఎవఁడొచ్చాడుమళ్లీ, [జ్ఞానయోగినిఁజూచి] నువ్వేనటరా! నువ్వే ? నువొచ్చావా? ఆరి దొంగముండాకొడకా!—ఏదైనా చేతి కందితే ఎత్తుకుపోవడానికి వచ్చావా? క్రిందటిసారి మొహాన పేడనీళ్లు గొట్టించుకున్నది చాలలేదటురా ? ఈసారి చెప్పుదెబ్బలు తగిలితేనేకాని నీకు బాగా బుద్ధిరాదు. గాడిద కొడుకా. ఏదే అమ్మా! నా చెప్పెక్కడుందోచూడు! వీణ్ని దేవాదేవేషం చేస్తాను !

జ్ఞాన - ఆహా ఆభాగ్యమే నాకుఁగల్గినయెడల నెంత యదృష్టవంతుఁడనై యుందునోకదా!

గీ, తామర సగర్భముఖ నిర్గతంబయిన, ప
విత్ర విప్రవంశమున నావిర్భవించి,
నట్టిత్వత్పదాంకితమయినట్టి పాద
రక్ష నాదేహమును పవిత్రంబు సేయు. ౨౭

కాశీ - ఓరి మొండిముండాకొడక ! నువ్వెంతకైనా తగినవాఁడవేరా! ఒక్కసారి నిజంగా నాపాదరక్ష నిన్ను పవిత్రంజేస్తేనేకాని, నీకీ వెర్రి వేదాంత మణఁగదు. చీటికీ మాటికీ మాకొంపకు దాపరించి నాభార్యతో గుసగుసలాడటం మానవు—

అత్త—ముందుదాని పళ్లురాలగొట్టి కొంపలోనికీడ్చుకొనిరాక, వాడ్నికొడతానంటావేమిరా ! వాఁడిమాట తరువాత చూడొచ్చునురా, మనబంగారము మంచిదైతే కంసాలివాడేం జెయ్యఁలఁడురా? దాన్ని నెత్తికెక్కించుకొని యింత అలుసిచ్చినవాడవు నువ్వేరా! దానియొడల వన్ను తిడితేనే కాదటరా నావి కలుపెట్టవైంది. అది నీ కేదో మందుపెట్టింది. దానివలలో పడ్డావు? అందుచేతనే దాన్ని గవ్వెత్తుమాటైనా అన

లేకుండావున్నావు! పెళ్లాం బెల్లం. తల్లి దయ్యం అన్నవాఁడు వెర్రివాడా! దాన్ని నెత్తి నెక్కించుకో! అమ్మవారిఘటాన్ని వూరేగించినట్టూరేగిందు! ఈవల్లకాట్లో కొంపా యీ దిక్కుమాలిన సంసారం వదలిపెట్టి నేను ఏకాకో లేచిపోతాలే! అప్పుడు పెళ్లాం మొగుడూ సుఖంగా వుంటురుగాని—

కాశీ - ఎందుకమ్మా! అంతటిమాటలనుకుంటావు! నీకంటెఅదినాకెక్కువటమ్మా!

సక్కు—అత్తగారూ! పండరి పురమున పాండురంగనాదునకు బ్రహ్మోత్సవములు జరుగుతున్నవని పౌరులందరును గుంపులుగూడి దర్శింప నరుగు చున్నారు! రంగ సందర్శనమునకై నాయంతరంగ ముర్విళ్లూరుచున్నది. అనుజ్ఞ యిత్తురా దర్శించి యతి శీఘ్రముగ మరలి వత్తును?

అత్త—ఓసి నీయమ్మ కాటికిబోను ఎంత తెగబడ్డావే! ఎంతధైర్యంగా అడుగుతున్నావే! పండువంటి సంసారములో మట్టిగొట్టుకొని, యీబికారి ముండకొడుకులతో కలసి, యాత్రికుబోయి మొగుడులాడక పోతినని యేడుస్తున్నావా? నీయేడుపు ఎట్లో కాను! నీయాత్ర క్షేత్రనిగాను!—ఇంకా చూస్తావేమిరా! ఇది యేరాత్రో పగలో కొంపలోంచి లేచి చక్కా బోఘుందిరా! స్తంభానికి కట్టిపడేయ్యండి! దీనిరోగం కటుక్కున కుదురుతుంది!......

1 శిష్యు—గురునాథా? పాప మీమెకు అభిలాషకు దగినంత యధికారములేదు. ఇట్టి యీసతి యాత్రకువచ్చుట గగనకుసుమము. ఆవల మనకు, కాలాతీతమగుచున్నది. పోవుదము రండు.

జ్ఞాని—రంగనికరుణ—అట్లే పోవుదము పద!.

( అనుబంధము 5 శిష్యులతో, జ్ఞానినిష్క్రమణ )

సక్కు—హా! గురునాథా! పోవుచుంటిరా- పోవుచుంటిరా? నాపాండురంగనితోపాటు, నీకును నాపైఁ గృప దప్పెనా? ఇంక నాకీ జన్మమునరంగసందర్శనభాగ్యము కలుగదా? కలుగదా!

కాశీ - శీఘ్రంగా దాటిపోయినాఁడో చెప్పుదెబ్బలు. తప్పించుకొన్నాడనుకో. గడుసుముండకొడుకే!-

అత్త- నీకు వాడు గురువటే! బికారిముండకొడుకు నీకు గురువటే! వాఁడు నిన్ను వదలిపెట్టి వెళ్లిపోయినాడని వలవల యేడుస్తున్నావా? దారివెంట బోయ్యే దౌర్భాగ్యపు పిధవలకోసం తల్లడిల్లడం మానతావా మానవా! రంగడురంగఁడని గంగిర్లెత్తడం చాలిస్తావా!- చాలించవా! బుద్ధొస్తుందా! వస్తుందా! (కొట్టును)

సక్కు - రంగా! శ్రీరంగ పాండురంగా!

అత్త:—అబ్బాయీ! తాడుతీసుకురారా దీన్ని స్తంభానికి బిగించికడదాము!

కాశీ - ఇక్కడేగాదు! సాలిట్లో బిగించికడదాము! లోపలికి పద-

అత్త - ఏమే! పద! లోపలికిపద కట్టిపడేస్తేగాని, నీ తెలుగుగదు,

(అందరు నిష్క్రమింతురు) [తెర)

తృతీయాంకము

# సతీ-సక్కుబాయి

## చతుర్థాంకము

—[ ♦ ]—

### 1 వ రంగము - పండరీపురము.

ప్రవేశము—శ్రీకృష్ణుడు - రాధాదేవి.

రాధా - నాథా! లోకైకనాథా!

గీ. భక్తజనుల బ్రహ్మోత్సవము లేమి,
తమ శరీరమందు, దాసతతికిఁ
గలుగు దద్దు లేమి లలితాంగ! నీదు మ
హత్త్వ నజభవాదు లరయఁగలరె?

శ్రీకృ—భక్తుల కష్టములను నావిగా ననుభవించుటయే, నాకు బ్రహ్మానంద దాయకమగు విషయముగా నెరుఁగుము.

గీ. భక్తమణియగు నాసక్కుబాయిపైన,
నామె సద్భక్తిఁగని యత్త యాగ్రహించి,
నేడు దయచేసినట్టి యాతాడనములె,
దద్దులై, నా శరీరమంతటను దోఁచె.

రాధా - ఆఁ ఆఁ! ఏమంటిరి? ఇవి సక్కుబాయి నామె యత్తగారు ప్రహరించిన దెబ్బలకు ప్రతిఫలములా? ఔరా! ఎంతగర్వ మా యత్తకు? మీభక్తులపై నెంత శాత్రవ మాపాపాత్మురాలికి! నాథా! ఆదుర్జాతి వృద్ధురాలి కెద్దియేని ప్రాయశ్చిత్తముఁ గావించు దనుక నా కాగ్రహ మణంగకున్నది. శీఘ్రముగ మనమా యింటికిఁ బోవుదము రండు-

శ్రీకృ - దేవీ! నిక్కముగ నది నిజమె పాపము సక్కుబాయి, యిప్పుడు తీరని సంకటమునఁ జిక్కియున్నది. ఆకష్టమును నివారింప నేనటుకరుగక తప్పదు.

రాధా - నాథా! ఇప్పుడా భక్తురాలికి క్రొత్తగాఁ గల్గిన కష్టమెట్టిది.?

శ్రీకృ - ఎట్టిదో యాలకింపుము.

ఆ పండరీపురమున బ్రహ్మోత్సవంబు ల
 టంచు, నిటకు రాఁదలచినట్టి
 భ క్తమణిని సక్కుబాయి నాసతి యత్త
 త్రాఁట గట్టిపెట్టె స్తంభమునకు ౩౦

ఏదేని, యుపాయాంతమున, నామెను వదలింపవలయును, అభిమతంబు గలదేని నీవును నా వెంటరమ్ము.

రాధా - అత్తకు ప్రాయశ్చిత్తము సేయుటకు నేనును, ఆభక్తురాలికిబంధవిమోచనము సేయుటకు మీరును - అవశ్యముగా నటకరుగుదుము. రండు.

(ఇరువురును—నిష్క్రమింతురు)

( తెర )

---

2 వ రంగము—సక్కుబాయి యిల్లు.

(ప్రవేశము — స్తంభమునఁ గట్టబడిన సక్కుబాయి.)

సక్కు - (అనుబంధము ౮) శ్రీకృష్ణా! భక్తప్రియా ! తుట్టతుదకు నాకీస్థితి గల్పించి యేమియు నెరుంగని చందమునఁ, నుపేక్షించితివా ? స్వామీ !

సీ. శ్రీయుతంబైన త్వదీయాకృతినిఁ గాంచి,
 కుతిదీరఁ బ్రణమిల్లఁ గోరి కోరి
 చంద్రభాగానదీసాంద్రతరంగంబు
 లందు గ్రుంకగ వాంఛ నంది యంది
 తనివార నీదు తీర్థప్రసాదంబుల
 నారగించెడుగాంక్ష నరసి యరసి
 నీదు మొప్ప సహస్రనామార్చనము స్వహ
 స్తంబులఁ గావింపఁ దలఁచి తలఁచి.
 వెంగగొట్టి పాండురంగా ! జగన్నాథ
 శ్రీరమేశ! కృష్ణ! శ్రీనివాస!
 రమ్యమౌ, త్వదీయ బ్రహ్మోత్సవముఁ గాంచు
 భాగ్యమింకఁ నొసఁగవా? మహాత్మ! ౩౧

స్వామీ! ఎంత ప్రార్థించినను, ఎంత మొరపెట్టినను ఎంతప్రలాపించినను, ఎంతబతిమాలుకొనినను, నాయాలాపనములు పవిత్రములగు నీ శ్రవణంబులం జొర

కున్నావా? తండ్రి—కాకున్న నన్ను రక్షింపవచ్చుటకు పండరీపురము మా యగ్రహారమునకు దూరమాయెనా? గరుడగమనా! నాడు సభిలో నార్తయై వేడుకొనిన పాంచాలిని గాచినకథ నీకు స్మృతికిరాదా? మకరిచే బాధింపబడి యాక్రందించిన గజేంద్రుని బ్రోచిన చరిత్రము నీ కింతలో మఱపునకు వచ్చెనా?— ప్రహ్లాదునిఁ బాలింపనరహరివై సభాస్తంభం బున నావిర్భవించినమాటను నేనెఱుంగ ననుకొంటివా? వారందరు నీకు దగ్గరచుట్టములైరా? నేను కాకపోతినా? నాపైనీకింత నిర్దాక్షిణ్యమేల? ఇంత పరాకేల? స్వామీ!—రాధాదేవిగాని, రుకుమాబాయిగాని నిన్ను తమ భుజలతలం గట్టి పండరీపురముననే బంధించిరా!

సీ. సోదరి యని ద్రౌపదీ దేవిఁ బ్రోచితి
వేమొ! నే నీబిడ్డనే మహాత్మ!
ఆర్తుఁ డంచు గజేంద్రు నప్పు డేలితి వేమొ—
యిపు డార్తి నే నందనే? దయాళు!
అల కుచేలుసుమైత్రి నరసి భాగ్యము లిచ్చి
తేమొ! నాయెడ వైరమేమి? స్వామి!—
దాసుఁ డనుచు రామదాసుఁ గాచితి వేమొ—
నేను, నీపదదాసినే! కృపాబ్ధి—
ఎంతకాలము నినుఁ బ్రతీక్షింతునయ్య!
ఎంతగా నీకొఱకు విలపింతు నయ్య!
తాలిమి వహింపజాల—నాతండ్రివైన
దైవమైన నిన్నిక వేడుదానఁగాను— 3-౨

అహోరాత్రములు నీకొఱకెంత యాతుర పడుచుంటినో నీయంతరాత్మరయుఱుం గదా! లోకచక్షూ, అత్తగారిచే స్తంభమునకుఁ గట్టుపడి యెంతయులమటించుచుంటినో —కనంబడదా! దయాభరణా! భౌతికంబగు నీమెుండిశరీర మిచ్చట ప్రాకులాడు చుండినను నాయాత్మ పండరిపురమున నిటుకరాలపై నిలచియున్న నీపద పద్మముల సన్నిధిని నిలచి నీకృపారసమునకై యెంతగా విలవిలకొట్టుకొనుచున్నదో గ్రహింపవా! విశ్వంభరా, ఇట్టినాయందా నీకింత నిరాదరణము, నాపైనా యింతనిర్దాక్షిణ్యము, నాయెడనా నీకింత విముఖత్వము, - నాకు నీ యాలయంబున, యమృతప్రవిత్రోచ్చిష్ట ప్రసాదంబు నేరుకొని తిను వాయసంబునకుఁ గల యదృష్టమైన లేదా. నేను నీకింత కగదాయనై పోతినా. నాప్రాణములు నీకర్పించితిని. తుచ్ఛమైన యీ శరీరమును నీ కర్పించితిని, నాసర్వావయవంబులను నీసేవా కైంకర్యమునందే, విని

యోగించితిని! గోపీలోలా, గోపాలబాల, కాంచనచేలా, నాయందింకను నీయుపేక్షా పరత్వము నుపేక్షింపనేల.... పండరిపురినుండి యింకనైన గదలిరావేల! నీకు భారమా, యిది దూరమా, రమా రమణా....

సీ. నోరు నొవ్వఁగ నిను నుతియించి నాలుక
ధన్యమయ్యెనటంచుఁ దలఁచినాను,
చేతులారగ నమస్కృతు లాచరించి హ
స్తములు ధన్యము లంచు దలఁచినాను,
చరణద్వయము నలసట నంద నృత్యము
సలిపి ధన్యములంచు తలచినాను,
కంఠము తడియార గానంబుఁ జేసి య
ద్దాని ధన్యంబుగాఁ దలఁచినాను,
దేహ మన్యకార్యంబులఁ దిరుగుచున్న
మానసము నీభజనమందె లీన మగుట
పుట్టుకకు సార్థకంబని పొంగినాను
గాని, ప్రారబ్ధహేతువుఁ గాంచనైతి.
ఆ. అహరహంబు నిట్లు లాహార పాన ని
ద్రావిహీనతలకు దలకఁగాని
పరమపురుష! నీదు బ్రహ్మోత్సవంబు ద
ర్శించు ప్రాప్తి లేదటంచు వగతు. ౩౯

సంతతము, మానవులు స్మరించు విషయములే స్వప్నముగాఁ బరిణమించునని తత్త్వజ్ఞులు వాకొందురు. కావున, నో దేవా, కొంతకాలము కన్నులు మూతును. స్వప్నమునందైన సాక్షాత్కరింతువేమో.

(కన్నులు మూయును.)

( రాధా కృష్ణులు ప్రవేశము )

కృష్ణు...రాధా, భక్తురాలగు సక్కుబాయి, పాపమిట్టిస్థితియందున్నదిదో చూచితివిగదా.

సీ. వెనుకకు స్తంభాన విరిచికట్టగబడి
లయతోఁ గరములు తాళంబువేయ
గదలమెదల లేని కాయంబుతో నోట
రంగా యనుచు సంస్మరణము సేయు

అరమోడ్చిభావనయందు లీనములైన
కనులునారూపునె కాంచుచుండ
తొలిఁట జొట్టఁగఁబడ్డ తనువెల్ల, నాణిము
త్యములను బోలు స్వేదమును విడువ,
గీ. భక్తిచేతనో—తనయత్తవలన భయము
చేతనో గుండె లదటునఁ జిందులాడ
తరుణి మూర్తిఁ దాల్చిన భక్తితత్వమట్లు
చలనమును మానియున్నది సక్కుబాయి. 37

ఈమె నీతిజంబు పరీక్షించి, పండరీపురమునకుఁ బంపి — నా బ్రహ్మోత్సవ దర్శనమువలనం గలుగు నానందము గల్గింపదున్న నింక నాభక్తసంరక్షణ బిరుద మేల? కాల్పనా!

రాధా—నాథా! ఈమె నిప్పుడు మీరేయుపాయమున రక్షింపఁ దలచి యున్నారు?—

కృష్ణు—దేవీ! ఉద్దేశ్యము గలుగవలయు నేగాని, యుపాయములకేమి కొఱంత?

ఆ. మాయచేత సక్కుబాయి రూపముతాల్చి
కట్టువడెద నామె యట్టు లిచట
సక్కుబాయి మరలి చనుదెంచుదనుక నే
నిందు సక్కువోలె నుందు, రాధ! 38

రాధ—ఓహో, ఇదియేమి నాథా! తమ లీలానటనము పరమాద్భుతముగ నున్నదే! తమరింపు దాస్యమునఁ జిక్కియుండఁగనే! భక్తులందరును బ్రహ్మోత్సవ మిషంబునఁ దమకు దాస్యము చేయుచుందురా?

కృష్ణు—దేవీ! భావనను మించిన పరమార్థములేదు. అచట నే నుండుట యొక టియు... లేకుండుట యొకటియు నా! నేను సర్వాంతర్యామినగుట నీ వెఱుంగవా?

ఆ. ఇచట నచట ననఁగ నేల? మేరునగంబు
నందు నణువునందు నుందు సమత
ఇందునందు ననఁగ నేల? సర్వచరాచ
రముల రూపకోటి నమరదాల్తు. 39

రాధ—సర్వచరాచర రూపసంస్థితులును, సర్వాంతర్యాములును, సాకారనిరా కార సమపరబ్రహ్మలును, జగన్నాటక సూత్రధారులును నగు తమ కిటులీలావటపమేల

యానందదాయక మగునుగాని, మముఁబోటి యవరోధజనంబులకు దేవరవారి యతికాల-విశ్లేషములకు దుస్సహదుఃఖదాయకము గదా !

కృష్ణ—రాధా! భక్తరక్షణము నాకెట్లో-మీ యందరకు నట్లే పరమకర్తవ్యము గదా!—కావున, సక్కుబాయికొరకును, నాభక్తావన ప్రతిజ్ఞానిర్వహణము కొరకును, మద్విశ్లేషదుఃఖమును, కొన్నినాళ్ళు మీరు భరింపకతప్పదు—

గీ. భక్తురాలికి బ్రహ్మోత్సవంబు గాంచు
మోదమును, గల్గఁజేసి మూర్ఖులైన
సక్కునత్తకు భర్తకు, నిక్కమైన
భక్తిఁ గల్గించివత్తు సత్వరము మరలి. ౩౮

రాధ—జగన్నాయకా ! సమస్తసురాధీశ్వర శిరఃకిరీటస్థగిత మణిఘృణీ నీరాజితపాదపీఠులై—సకల బ్రహ్మాండమండితోదరులై-మూర్త్రితయాతీతులై - బ్రహ్మాండనాయకులైన తమకు నేటి కొక నిరుపేదబ్రాహ్మణి కారణంబున, నిష్కారుణులగు దూర్తవిప్రులవూరింట దాస్యమా? ఆహాహా! తమవంటివారికిని విధివ్రాత నతిక్రమించుట దుస్సాధ్యమయ్యెనుగదా! నాథా !...

సీ. ఇంటిచాకిరి నిర్వహింపఁదప్పుల నేరి
యెంతగా మిమ్ము బాధింపఁ గలదో!
గడగడ వణకించు చలికైన సహియించి
చన్నీటి స్నానముల్ సలుపుమనునో !
పీతాంబరమ్మును విడిచి వైదికవు రై
కను చీర నందించి కట్టుమనునో!
అష్టసతీలోల్య మణగించి కొడుకుతో
పడకఁ గాపురమును మిడుకుమనునో!
కొట్టునో యేమొ—చీపురుకట్టతోడ
నింక నెట్లు బాధించునో యేమిగతియొ—
విశ్వపతియైన జగదేక విభునిచేత
ప్రకటకలహోక్త యాసక్కుబాయియత్త. ౩౯

కృష్ణ—కల్యాణీ, ఇవియన్నియు నిజముగా ముందు ప్రవర్తింపఁగల కృత్యంబులే యగుట నిక్కము. ఇవి, నీ మతికిఁ గష్టముగనుండిననుండుఁగాక! నాహృదయము నకుఁ బరమప్రమోదప్రదంబులు కావున నాకొరకై విచారింపక నీవు పండరిపురంబు నకుఁ గదలిపొమ్ము. నేను త్వరలో రాఁగలను.

రాధ—నాథా! తమహృదయమున కానందకరములగు విషయములే మాకును పరమానందప్రదము! నాకు మీ విషయమై యింక విచారమేమియును లేదు. కాని, మా సక్కుబాయి యత్తకొకింత బుద్ధిచెప్పవలయునని యున్నది. ఆ యవశిష్టమును దీర్చుకొని నే నరిగెదను—

కృష్ణు - ఆమెకు, ప్రాయశ్చిత్తము కాలాంతరమున పాపపరిపాక సమయమున నదియే కలుగఁగలదు. నీ వా ప్రసక్తిం దగులకుము పొమ్ము...

రాధ - అట్లయిన తమ యభీష్టానుసారమే యొనరింతును. నాకింక సెలవు తమరు సత్వర దాస్యవిముక్తురాలైదయచేతురని ప్రార్థింతును. [నిష్క్రమించును]

(అత్త—ప్రవేశము)

అత్త—ఏమే! సక్కూ! ఇప్పటికైనా బుద్ధితిరిగిందా లేదా ?

సక్కు—(కన్నులు దెరచి) ఆహా! ఎంతటి దివ్యస్వప్నము !......అత్తగారూ ! ఇప్పుడిచటికి రాధామాయితోఁగలసి, శ్రీపాండురంగమూర్తి వేంచేయలేదా?...వచ్చినవాఁ డింతలో నెందుకోయెను.

అత్త...ఓసి నిర్భాగ్యపు చచ్చినదానా! ఇంకా నీకీరోగం అణగ లేదటే ? కలగంటున్నావా! పిచ్చిపట్టిందా ? ఎక్కడికృష్ణుడు!...నీబొందమీద కృష్ణుడు!

సక్కు—కాదు కాదు మీరు భ్రమపడుచున్నారు ? సర్వాంతర్యామియగు నా భగవంతుని శుభాగమనమును మీరు గుర్తింపజాలకున్నారు! చూడుఁడు.

సీ. చెవి యొగ్గి వినరమ్మ శ్రవణపర్వంబుగ
వంశీస్వరము వినంబడును మీకు
కనులారఁ గనరమ్మ కంబుచక్రాంకిత
పదచిహ్నములు కనంబడును మీకు
ముక్కుచూడరమ్మ! సమ్మోహనాగరుగంధ
ఘనసౌరభము గుబులొక్కొనును మీకు
మదిఁ గాంచరమ్మ! కోమలఘనశ్యామల
దుర్లోక తేజంబు దోఁచు మీకు

గీ. శ్రీవిభుఁడు రాధికాసతి చెట్టవట్టి
నన్ను రక్షింప వచ్చియున్నాఁడు నిజము;
వచ్చి యీక్షణమున నెందుజొచ్చెనమ్మ?
చేరి ప్రార్థింతు; దాచక చెప్పరమ్మ!— ౪౦

అత్త—కానీ! కాని—తే—ఇహ నిన్ను కొట్టినా తిట్టినా ఏంజేసినా లాభం లేదు. నీకిదే ప్రాయశ్చిత్తం. ఇట్లా స్తంభానికి కట్టుబడివుండు. ఎవ్వరొస్తారో చూస్తానుగాదూ—

[నిష్క్రమించును]

కృష్ణు...(స్వగతము) అత్తమరలిరాకమున్నే, నేను సక్కుబాయి భర్తరూప మువచ్చి యీమె నిర్బంధమును వదలించి స్తంభమునఁ గట్టువడియుందును గాక...

[నిష్క్రమించును]

సక్కు—(స్వగతము) వేణునాదప్రియా రాధా నాధా! నీవు వచ్చితివి—పోయితివి. ఎందులకు వచ్చితివో—ఎందులకు పోయితివో — ఎచటికి బోయితివో ఎన్నడు మరల వచ్చెదవో— ఎరింగిన వారెవ్వరును లేరుగదా. ఈ దాగుడుమూతల పరమార్థమేమి స్వామీ! నీవు వచ్చితివని పలికినంతనే అత్తగారి కంటికి నేను వైరిదాని వలె గనబడితిని. నన్ను వైరిదానివని పలికిన యత్తగారు వైరిదని నేను తలంచు చున్నాను! ఈ విధముగా జగమంతయు నీ మహిమచే వైరిదైపోవుచున్నదిగదా!—

సీ. తలక్రిందుగా ఘోర తపమాచరించియు
విఫలాత్ములౌ మునుల్ వెట్టివారు
తీర్థయాత్రలను, నదీస్నానములు జేసి
విసిగెడు యాత్రికుల్ వెట్టి
హఠయోగములచేత నలసటగను నవి
వేక సన్యాసులు వెట్టివారు;
ఎదుటనే యున్నని న్నెఱుఁగఁగా లేక, ని
ర్విణ్ణులౌ లోకులు వెట్టివారు;
కోరి, భక్తిమీర—నోరార నిన్ను "రం
గా" యటంచు బిలుచునట్టి యాత్మ
భక్తకోటి కిట్టి ప్రత్యక్షమగుచుండు
నీ విచిత్రమహిమ నెఱుఁగ రెవరు. ౨౧

(కృష్ణుఁడు కాశీపతివేషముతో ప్రవేశించును)

కపటుకాశీపతి... సక్కూ! సక్కూ! మాఅమ్మ నిన్నింకా స్తంభానికి విరిచి కట్టేవుంచిందా?—

సక్కు—నాధా! వచ్చితిరా! అత్తగారితో సమానముగ మీరును నిర్దయాత్ముల రైతిరా?—నన్నీ నిర్బంధమునందింక నెంతకాల ముంచెదరు?

క కా—సక్కూ! నీకు నిజం... పండరీపుర బ్రహ్మోత్సవము చూడాలనికోరికగా వుందా? నిజం చెప్పు-

సక్కు - నాధా! నిజము చెప్పినను, అసత్యముచెప్పినను, ఫలమొక్కటియేకదా! అభిలాష యున్నంత మాత్రమున నన్నచ్చటికి కంపువారెవ్వరు? ఆకాశ కుసుమములతో తుల్యమైన వాంఛలవలనఁ బ్రయోజనమేమి?

క-కా - ప్రయోజనమున్నది! నీకభిలాషగా వుందేమో నిజం చెప్పు—

సక్కు—అయ్యో! అభిలాషగలదానయని ప్రశ్నించుచున్నారా! ఆయభిలాష చేతనేకదా యీ నిర్బంధమును సయిత మనుభవింపవలసి వచ్చినది.

క-కా - నేను నీ విషయంలో - మా అమ్మతో యిప్పుడే చాలసేపు గట్టిగా వాదించి త్వరలోనే నీవు పండరీపురంనుంచి మళ్లీవచ్చేపద్ధతిమీద ఆమెను సమాధాన పరిచాను మన పొరుగింటి వున్నయ్యశాస్త్రి, ఆయన భార్యా వెళుతూంటే నిన్ను గూడా తీసుకువెళ్లవలసిందని ఏర్పాటుచేశాను గుమ్మంలో వాళ్ళు కనిపెట్టుకొని వున్నారు! నీవు త్వరగా వెళ్ళిరా! నీబట్టలుగూడా మూటకట్టి తెచ్చాను. నీకట్లు వదలిస్తాను ఇక వెళ్ళి దేవుడి దర్శనం చేసికొని శీఘ్రంగా రా-

(కట్లు విప్పును)

సక్కు— (ఆనందముతో) హా! పాండురంగా! ఇంతకాలమువరకు నీకు నాపై ననుగ్రహముగలిగెనా! నీచిత్రము బ్రహ్మాదులకుగూడ నగోచరమైనదిగదా స్వామీ !-

క-కా - ఇంక యిక్కడుండకు. శీఘ్రంగా వెళ్లు. మళ్లీ మా అమ్మకేమి తిక్కపుడుతుందో!-

సక్కు - నాథా! మీపాదపద్మముల కనేక నమస్కారములు! నాకు దయతో సెలవిండు. శీఘ్రముగ మరలి వచ్చెదను.

(నిష్క్రమించును.)

కృష్ణ - (స్వగ) ఇప్పటికిగదా భక్తురాలికి నిర్బంధము వదలెను! నా హృదయ భారము వదలెను. ఇంక నేను సక్కుబాయి నాకృతితో నీ స్తంభమునకు గట్టుబడియుండెదగాక !

(స్తంభము నానుకొనగా తాడు తనంతతనే బంధించును)

ఆ. సక్కునాటకమున, జరిగె నాల్గంకము
లింక నొక్కయంక మిందుగడచు,
పంచమాంకమందు భరత వాక్యమునకు
ముందు— మోక్షమిత్తు నందఱకును. క-రి

( అనుబంధము 7 )

చతుర్థాంకము.



# సతీ-సక్కుబాయి

## పంచమాంకము

—[ • ]—

### 1 వ రంగము—పండరీపురము.

ప్రవేశము—పెద్దిసెట్టి.

సెట్టి - గోల! గోల! ఒక్కటేగోలగదా యాత్త యాత్తరంటే, ఆదేందో పెద్దసంతగదా అనుకొని సంబరపడి, యవ్వారమంతా యెక్కడిదక్కడ దిగదొక్కుకొని వొచ్చానుగాని, యీ మాయగోల సంగతి తెలిసుంటె గల్లాపెట్టెకాణ్ణుంచి కదిలేవోణ్ణా?-దాన్నోట్లో మన్నుబడ! మాయసచ్చింది మారొవవలత్తప్పముండ యెదురుగా వొచ్చింది. అప్పుడే శకునమైందనుకున్నా - కుక్క సంతకుబోయినట్టు దడదడా యాత్తరకొచ్చానన్నమాటేకాని, అనుకున్న యవ్వారాల్లో అరబాగమన్నా జరగలేదుగదా! ఒక బేరమా - ఒకసారమా — ఏముందీడ? నాయెద్దం! - యాడకి బోయినా పీడాకారపోళ్ళు దానం బానం అనుకుంటూ సేయిజాచేవాళ్ళేగాని, పదిడబ్బులు లాబించేదారి జూపే యెదవొక్కడైనా కనపడడుగదా!

సీ. చంద్రభాగ నదిలో సలితో వొణుకుతూంటె,
పీక్కుతినేవోళ్ళు బేపనోళ్ళు,
గుళ్లోకిబోతూంటె గుంపులు గుంపులై
వెంటబడేవోళ్ళు బిచ్చగాళ్ళు,
సిప్పనత్తినబెట్టి సేయిజాచేవోళ్లు,
సామిదక్షిణకు పూజారిగాళ్ళు,
పూలమ్ముతామని బోడిసాతానోళ్ళు
డబ్బులాగ రాళ్లు దెబ్బగాల,
గూనివాళ్ళను మఱి కుంటిగ్రుడ్డివాళ్లు,
తలపడేవాళ్ళు పెద్దిభూతాలలాగు,
అమ్మకపుకొంటె యీతీర్థయాత్రకంటె
సుమ్మగా వుంది నామట్టు కమ్మతోడు.

బుద్ధిలేనోడూ - పనిలేనోడూ - బతకలేనోడూ, తీర్తానికి రావలసిందేగాని, సంసారికిమాత్రం - యిది లచ్చనంగాదని కన్నెకామొగ్గరుమీద వొట్టేసుకొని ఖరీ చెపుతా - లేకపోతే, యీతానాలేంటి - యీపెయ్యనాకాం లేంటి - యీపత్రిహెచ్చి నాలేంటి - యీ మొక్కుబళ్లేంటి - ముత్తుకోలేంటి - అన్నిటికీ డబ్బుకరుసేగందా - చనంతీకలేదు - దమ్మిడీ ఆదాయంలేదు - ఏమియాత్తరా - నా బొందమీదయాత్తర! కూటికొచ్చినయాత్తరా - గుడ్డకొచ్చినయాత్తరా - ఈ తాశాలూ తప్పెట్లూ - బజన్లూ పాడూ - చూస్తావుంటే - అమ్మతోడు - నా వొళ్ళు మా సిరసిర లాడుతూంది. ఇంతటితోటి జాతరిసౌఖ్యం చాలుగాని, ఊరోళ్ళెవళ్లయిన తోడుదొరికితే తిన్నగా కాలికి బుద్ధిచెప్పుదును. అన్నట్టు - శంబుచాత్తుర్లు గంపరగోళంలో ఫురుగునాకిబోయినాడే? మొన్న తానంచేత్తావుంటే కామోసు - నదికాడ నీరుకాసులుబడతా కనబడ్డాడు అప్పట్నుంచి జాడా జవాబులేదు. (మొగమునకు చేయి అడ్డము బెట్టుకొని చూచుచు) ఆ వచ్చేమనిషి చాత్తుర్లగా వున్నాడే!

(శంభుశాస్త్రి ప్రవేశం)

శంభు - అదుగో ! పెద్దిసెట్టిలాగున్నాడే! సెట్టీ! ఇంకా బాగున్నావా ?-

పెద్ది - అదుగో! శాత్తుర్లూ! వోగాయిత్తంగా వొంకరమాట్లాడతావేమయ్యా !

శంభు - నిజంగానే సెట్టి! నీతోడూ - నెలలునిండిన పేరంటాలుకుమల్లే - గూనలాంటి కడుపుతో, గున్నయేనుగులాగ, నువ్వీ సంకట్లో యెక్కడో నలిగిపోయినావనుకున్నాను సుమా ! మళ్ళీనువ్వు నాకంటు బడేసరికి, మావచ్చిన పెద్దల్ని చూచినంత సంతోషమొచ్చింది! నువ్వు నిజమనుకో - అబద్ధమనుకో.

పెద్ది - ఛీ ఛీ! అన్నీ వోగాయిత్తరం మాటలే! - అన్నీ ఔశకునంమాటలే పగలుబుట్టావా - రాతిరిపుట్టావా శాత్తుర్లూ -

శంభు—ఖరసంవత్సరపు కరువుకు, నువ్వూ, నేనూ, వొక్క గడియలోనే పుట్టాంగాని... రెండురోజులనుంచీ ఎక్కడాకనబడలేదు, ఏమైపోయినావూ ?

పెద్ది - ఇంకాపైగా నామీదనా నీనూర్యం ? యీవరడివిలో రెండు రోజుల్నుంచీ పిల్లనిడబ్బులాగ తిరిగి తిరిగీ కాళ్ళరిగిపోయినయిగాని నువ్వు కాపడందేనా ! ఐతేపరేగాని జాతరసౌఖ్యం బాగానేవుంది పెందలాడే కొంపకు జేరదాం... నీ పెయాన మెప్పుడేంటి?

సంభు—ఏమీ! అంత తొందరగా పెయాణం గడుతున్నావు? యాత్ర నీకేమీ నచ్చింది గాదా యేమిటి ?

పెద్ది—మా కావమరది బొందలాగుంది యాత్తగంటే యిదేనంటదాన్ని నేనేంటో అనుకో నొచ్చాను.

శంభు - మరి... యాత్రంటే నువ్వేమనుకున్నా వేమిటి ?

పెద్ది - ఏమనుకున్నానో - సెప్పేదా ? ఎలాకోలాలు పట్టించి, సింకసేటులు కట్టువుగదా-

శంభు— వేళాకోళాలా? రామ రామ కొత్తగా నీకూనాకూ ఎప్పుడైనా వుందా?

పెద్ది—ఐతే— సెపుతున్నావిను.

సీ. కొబ్బరికాయమోటి గుళ్లోనికేగాని,
బారీగ కెరిడీల బేరమేది?

శంభు—ఓస్? ఇంతేనంటోయ్ సెట్టి ముసుగులు కప్పుకొని ఎన్ని కరిడీలు యాత్రకొచ్చినవో కనబడలేదూ! పోనీ—పది కరిడీలు బేరమాడలేక పోయినావా! అట్టే వ్యాపారానికి పనికొచ్చును.

పెద్ది—ఆ కరిడీలు నీకే బాబూ! సచ్చుల్లిపాయలమ్ముకు నేవోణ్ని సరసమెరుగ నోణ్ని నాకెందుకింకా సెపుతావిను.

సీ. పిడికెడు బియ్యము బిచ్చాలకేగాని,
బస్తాలకొద్ది యవారమేది?

శంభు - ఏమీ ఇంకా యాత్రిలో బస్తాలేతక్కువైపోయినాయా? నీలాంటి బలిసిన బస్తాలు చాలావచ్చినవే! అందులో నువ్వు బియ్యపు బస్తావో—పిప్పళ్లబస్తావో—ఉప్పుబస్తావో పప్పుబస్తావో ఏదో వొకటవుతావుగదా! ఇంకాఇలాంటి బస్తాలు కొన్ని కలుపుకుంటే కావలసినంత యవ్వారం—

పెద్ది—చాల్చాలులేవయ్యా! నేర్చుకొనిపోయినావు శాస్తుర్లూ! అందఱూ నీలాగే, గొల్లభామ పురుగుల్లాగ పిల్లగాలికే పిల్లిమిరియాలేస్తారంటయ్యా! తిన్నా నాలాగ మానెడు బియ్యంవన్నం తినాలె—కన్నా నాలాగ పదిమంది బిడ్డల్ని కనాలె! దీనికేంగాని, యింకా సెప్పుతాను విను.

సీ. ధర్మాలకని దమ్మిడీ లేగాని,
వొడ్డీయవారపు యోచ నేది?

శంభు—ఈ యాత్రల్లోగూడా నీకు వడ్డీ అసలూ కలవరింతలుతప్ప మఱొక వూహాలేదేమి? పాపమోయ్ సెట్టి యాత్రికోసం కొద్దోగొప్పో ఖర్చుపెట్టావుగదా! అది అసలనుకో! వారంరోజులపాటు వ్యాపారం కట్టిపెట్టావుగదా! అది వడ్డీ అనుకో!— ఇంకేమీ?

పెద్ది—మంచి లాభపాటి యవ్వారం చూపించావయ్యా శాత్తుర్లూ! ఇంకో వారంరోజులపాటిలాగంటి జాతర్లెంట తిరిగితే సిప్పట్టుకొని బైదేల్లవలసిందే! ఆసంగతి కేంగాని యింకా యినుమరి.

సీ. గంగిరెద్దులవోళ్ళ గంట్రగోళమె కాని,
పేరైన గిత్తల బేర మేది?—

శంభు... పెద్దిసెట్టి! పాండురంగనియాత్ర పశువులసంత కాకపోయెనని విచారపడుతున్నావా? భక్తిలేని మనుష్యులంతా రెండుకాళ్లపశువులతో సమానమని పెద్ద

బనగా వినలేదూ!- ఈ వచ్చిన జనంలో అలాంటి పశువులు అనేకవేలుండవచ్చును. ఇదికూడా ఒకవిధంగా పశువులసంతే కనుక నీకా విచారమక్కర్లేదు.

పెద్ది...అబ్బో! అబ్బో! ఎర్రిచాత్తుర్లుగాయు వీశాకోశాలచాత్తుర్లే ఇసిరాడు మాబాగా యిసిరాడు ఈ దెబ్బనామీదేకామోసు! కొడితే కొట్టావుగాని, కొస తెంటాయిను మరి.

ఆ. యేత్త రేత్తరంటె యేంటో గదా అని
మొదలు తెలియకుండ మోసపోతి
తిన్నగుండలేక తీర్థానికొత్తేను
సొమ్ముబోయి తుదకు రిమ్మ బట్టె, ౪౨

శంభు...సొమ్ముబోయిందని యేడుస్తున్నావేమోగాని రిమ్మబట్టడానికి నీకే మొచ్చింది- దుక్కలాగున్నావు!-

సెట్టి - సత్రింభోజనాలు మరిగి నువ్వ్వానాకంటె దుక్కలాగా బలిశావుగాని శాతుర్లూ - ఇంతకూ నీప్రయాణమెప్పుడో చెప్పావు గావు.

శంభు - బ్రిహ్మోత్సవంగాందే ప్రియాణమేమిటోయ్! ఎందుకొచ్చినట్టు ఎందుకు పోయినట్టు?

పెద్ది - బెమ్మోచ్చవమా! - పీడాకారమో - అయన్నె నా కెందు కయ్యా! పోమటోణ్ణి.

శంభు - ఈసాయంత్రమే బ్రిహ్మోత్సవం జరుగుతుంది. ఈ వొక్కపూటా వోపికపట్టు - తెల్లారగటే - లేచిపోదాము.

పెద్ది - మాపెద్దోడు - అసలే పెంకిగటం. ఏదో యాపారం యెలగబట్టు కొత్తానంటే సరేకామోల్సని సంబరపడ్డాడు. - యెలగబెట్టిన యవ్వారాలు లేకున్నా యెంటనే కొంపకైనా పోకపోతే, నా గొంతుక్కాయ కోరికేత్తాడు...ఏమను కున్నావో...

శంభు—భయం లేదులే! మీపెద్దోడితో నేను చెపుతాను! ఇల్లాంటి బ్రహ్మోత్సవం నీజన్మలో మళ్ళీ చూడగలవా!...

పెద్ది—ఏంజేత్తావో - ఇంకా నీదేభారం ఇదిగో! శాత్తుర్లు! డబ్బుకుగూడా నీక్కచ్చిగా వులదేట్టుంది. నీలాటిరేవులో నీరుకాసులు దండుకున్నట్టున్నావు! కొ గొప్పా సర్దాలేమరి? నీపాతబాకీ దీరినట్టా వుంటుంది. నాయాత్రిఖర్చు గడిసినట్టూ ఉంటుంది.

శంభు...అట్లాగే చూతాంలే! ఈవేళకుండు—

(తెరలో) జయా! సక్కూబాయికి జయా!—

పెద్ది—అదేంటయ్యా! ఆ గోలిన్నావా శాత్తుర్లు! సక్కూబాయంటే మునూరి సక్కూబాయమ్మ గాదుగందా!

శంభు—అవునవును, మనయూరి సక్కుబాయిలాగేవుంది! ఆమెవెంట భజనలు చేస్తూ - జయశబ్దాలతో గుళ్లోకి తీసుకొనిపోతున్నారు. ఆచిత్ర మేమిటో మనం గూడా చూచేపోదాం - నాలుగడుగులు తొందరగా పడనియ్యి.

సెట్టి— పాణకలాంటి ముండాకొడుకును, బోర్లబడగలను. నీ పుణ్యమాయిర్శి, నిమ్మళంగా నడువు శాస్త్రుల్లు.

(ఇరువురు నిష్క్రమింతురు)

2 వ రంగము—పాండురంగని ఆలయము.

(ప్రవేశము—దేవుని కెదురుగ భక్తుల నడుమ సక్కుబాయి)

భక్తులు - [అనుబంధము 8]

సక్కు—(పాండురంగనికి సాష్టాంగ నమస్కారము చేసి) హా! రంగా! పాండురంగా! ఎన్నినాళ్లకు నీదివ్యసందర్శన భాగ్యము గలుగఁ జేసితివయ్యా! ఎన్నినాళ్లకీయభాగినిపైన, నీకృపామృతమును వర్షింపఁ జేసితివయ్యా! ఈ శుష్కపాణిని, నీలోఁ గలుపుకొనవా దేవా! దేవా.

సీ. ఇన్నినాళ్ళకుంగదా—నిన్ను నిర్భయముగా
స్మరియించి భజనంబు సలుపఁగలిగె—;
నేడుగదా పాపనిచయహారం బగు
శ్రీనికేతనము దర్శింప గలిగె;
ఈనాడుగా కోటిభాను ప్రభాతీత
మైన యుష్మన్మూర్తిఁ గానవయ్యె
ఇపుడుగదా—జగద్ధిత మంగళాకర
పదపద్మ సంసేవం బడయగలిగె;
నేటికేఁకదా! జగన్నాధ! నిర్మలంబు
నిరుపమాన మహానందకరము పరమ
పావనంబైన నిశ్చలభక్తి జలధి
మున్గి తేలియాడెడు సుప్రమోద మబ్బె. రంగ

కృష్ణా! దివ్యమంగళస్వరూపా! జగన్మోహనమై జగన్మంగళ ప్రదమైన నీమోహనాకారంబును సందర్శించిన యీకన్నులతో పాపాకరంబగు నీ పాదభాతిక ప్రపంచకమును చూడఁజాల! పరమ పవిత్రమైన నీ నామకీర్తనం బొనరించిన యీనాల్కతో, నిస్సారమై హేయమగు నితరప్రసంగమును గావింపనోప! పరమపదంబగు నీ సన్నిధానంబునకు నడచిన యీ పాదయుగళంబుతో దుర్జనసమాజములంబ గుమా-

యగ్రిహారంబునకు నడువజాల, సమస్త జగత్కర్తవగు నీకు దాస్యంబొనరించిన ఈ శరీరముతో నికృష్టంబగు సంసారమున దాస్యంబొనఁపజాల ! నీ యాలయంబు నిఁక విడువజాల నీ సన్నిధానముం బాయజాల, నీమూర్తినుండి దృష్టిని మరల్పజాల, నీ పూజాపరిచర్యనుండి యీహస్తముల నెడసేయంజాల! దురాలోకమై దుర్నిరీక్ష్యంబైన నీమహాతేజశ్శిఖలయందీ ప్రాణిని లీనము గావించుకొనుము! అనంతకోటి బ్రహ్మాండముల నిముడ్చుకొన శక్తిగలిగిన, యుమ్మన్మహోదరాంతరమున నీ యల్పప్రాణికి స్థానములభింపదా! ఆహాహా, బాలగోపాలా గోపికాలోలా , ఆనాటి నీరాసక్రీడామహోత్సవము నీనాడు మరల నా పాపంపుగన్నులకుఁ జూపించుచున్నావా, తండ్రి భక్తశిఖామణులారా – నేత్రపర్వముగా మనలఁ గన్నతండ్రి నటించు రాసలీలోత్సవమును దర్శించుచున్నారా? శ్రవణ పర్వముగా మనోహరమురలీగానము నాకర్ణించుచున్నారా? కన్నులున్నందులకు వానిని సార్థకములుగా నొనరించుకొనుటకింతకన్న తరుణమేది? చెవులున్నందులకు వానిని చరితార్థములు గావించుకొనుటకు కిదిగదా యదను!

సీ. ఒక గోపికకును వేఱొక గోపికకు మధ్య
(శ్రీ)మనోహరుఁడు వేంచేసియుండ,
ఒకకృష్ణు చెఱుత గోపికయు గోపిక చిరు
తను, మాధవుం డందుకొనుచుండ,
ఘల్లు ఘల్లు మనంగ, గజ్జెలందెలఁ మ్రోత
నృత్యధ్వనికి, లయనేర్పుచుండ,
ఇందఱికంటంబు లేకమై పాడెదు,
గానతరంగముల్ గగనమంట
అందఱకు మధ్య త్రిభువనానందమూర్తి,
పంచమస్థాయి మురళి వాయించుచుండ,
గోపికాకృష్ణ వలయస్వరూపమైన
రాసలీలా నటప్రదర్శనముఁ గనుఁడు తే

ఓ భక్తులారా, రండు—రండు—ఊరక తెల్లవోయి చూచెదరేల? మహత్తరంబగు నిట్టితరుణమును వ్యర్థపరచుకొందురా ? ఇంతకన్న వెఱ్ఱితనమెందైన నుండునా ? ప్రత్యక్షముగ శ్రీపాండురంగమూర్తి తన రాసక్రీడోత్సవ ప్రదర్శనముచే మన పాపపు జన్మల తరింపఁచేయుచుండగా వ్యర్థులై నిలువబడియెదరేల? అయ్యయ్యో! నాపలుకులు మీచెవులకు వినఁపడుటలేదా, జన్మోత్సాహంబగు రాసలీల మీకన్నులనుగనపడుటలేదా, అయ్యలారా! రండు—అమ్మలారా, రండు. ఇది మన పురాకృత పుణ్యవశంబున లభించిన యపూర్వతరుణము, వ్యర్థముచేయరానిది,- మనమును గోపికాకృష్ణులతోఁ గలసి తాండవింతము – ఆడుదము –పాడుదము – అనుభవింతము – ఆనందింతము – రండు, రండు.

గీ. కృష్ణుఁడెన్నఁడో యానాడు, బృందలోన—
రాసలీలోత్సవంబును జేసెననుచు,
కథలు జెప్పి నాలించుటే కాక, నేడు
కాంచుచున్నాము హితులార! కన్నులార!— ౪౭

అయ్యయ్యో ! ఇంకమరాకున్నారేమి ! కదలకున్నారేమి? రాధా! కృపా క్షము చుట్టీఁడగు భగవంతుఁడు మనకనుగ్రహించిన దివ్యమైనతరుణమును వ్యర్థపరచుకొందురా! కానిండు! నేనొక్కతెనే గానముచేయుదును. ఒక్కతెనే నాట్యముచేయుదును !

♦ రా స క్రీ డా ష్ట క ము ♦

అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే ణాంగనా
ఇత్థమాకల్పితే మండలే, మధ్యగః
సంగగా వేణునా దేవకీనందన. 1

కేకికేకాదృతానేకపంకేరుహే । లీనహంసావళీ హృద్యతా హృద్యతా
కంసవంశాటవీదాహదావానలః । సంగగా వేణునా దేవకీనందనః. 2
క్వాపి వీణాభిరారావిణాకంపితః । క్వాపి వీణాభిరాకింకిణీనర్తితః
క్వాపి వీణాభిరామాంతరం గాపితః।సంగగా వేణునా దేవకీనందనః 3
చారుచంద్రావళీలోచనైశ్చుంబితో । గోపగోబృందగోపాలికావల్లభః
వల్లవీబృందబృందారకః కాముకః । సంగగా వేణునా దేవకీ నందనః 4
మౌళిమాలామిళన్మత్త భృంగీలతా । భీతభీతప్రియావిభ్రమాలింగితః
స్రస్తగోపీకుచాభోగసమ్మేళితః । సంగగా వేణునా దేవకీనందనః. 5
చారుచామీకరాభాసభామావిభు । ర్వైజయంతీలతావాసితోరహస్థలః
నందబృదావనే వాసితామధ్యగః । సంగగా వేణునా దేవకీనందనః 6
బాలికాతాళికాతాళలీలాలయా । సంగసందర్శితభ్రూలతావిభ్రమః
గోపికాగీతదత్తావధాన స్స్వయం । సంగగా వేణునా దేవకీనందనః 7
పారిజాతంసముధృత్యరాధావరో రోపయామాస భామాగృహస్యాంగణే
శీతశీతేపటే యామునియే తటే । సంగగా వేణునా దేవకీనందనః 8(రలా)

(మూర్ఛిల్లును)

శంభు - ఏమండీ! జ్ఞానయోగీంద్రులవారూ! ఈ గందరగోళం మీకేమన్నా అర్థమయిందా?

సెట్టి - సక్కుబాయమ్మను! చానాళ్ళనుంచీ పిచ్చిపిచ్చిని అత్తమ్మండే, మొక్తుకునేది గాదంటయ్యా! అదే ఈపిచ్చి అర్థంగావఁటానికేంటి? ఇదేమన్నా చాత్తరమా? పురాణమా—

శంభు - కాదుండోయ్! కోమటయ్యా, నీకేం తెలుసును? వారిని చెప్పనియ్యి

జ్ఞాన - అయ్యా, అర్థమగుటకేమున్నది? మహాభక్తురాలగు సక్కుబాయి దివ్యదృష్టియందు శ్రీపాండురంగమూర్తి తన రాసక్రీడా మహోత్సవము ప్రదర్శించుచున్నాడు. పాపాత్ములమును- ప్రాకృతులమును నైన, మన కట్టి దివ్యసందర్శన భాగ్యమగుటలేదు. భక్తుల కసాధ్యమగు కార్యమేది?

సీ. బాలుఁడై తననోట బ్రహ్మాండములు జూపె
తల్లిభీతిల్ల నీ నల్లనయ్య,
మఱఁదికి రణరంగమధ్యభాగమున, వి
శ్వావతార ప్రదర్శనముఁ జేసె
చెలియలి కక్షయ చేలంబు లందించె
నెల్లవైరులకుఁ గన్నెఱ్ఱగాఁగ
కాళీయ ఫణిఫణాగ్రములఁ దాండవమాడె,
పాలచెక్కుల పూప బాల్యమందె
భారమగుకొండ నెత్తె గోపకులు బెదర
గాలితోఁ బోరె మింట నక్కజముగాఁగ
పద్మనాభుని లీలాప్రబంధ గీతి
కర్థమును జెప్పనేర్చు మహాత్ముఁడెవఁడు? రగా

సక్కుబాయి మహామహితాత్మురాలు. ఆమెశక్తి యెట్టిదో యాపరాత్పరునకే తెలియవలయును! ఆ పరంధాముని మహిమ యెట్టిదో యాభక్తురాలికే తెలియవలయును. మూఢాత్ములమగు మనమా రహస్యార్థముల నూహింపుటకైనఁదగుదుమా?

శంభు — పెద్దపులిలాంటి అత్తగారి నిర్బంధంలోంచి, ఎట్లాబయటపడి పండరీపురమొచ్చిందోగాని, మళ్ళీ యిక్కణ్ణుంచి యింటికిమాత్రం వెళ్ళేటట్టు కనఁబడదు.

సెట్టి - నువ్వింకా యినలేదంటయ్యా! కాశీపతిశాస్త్రుల్లే సక్కుబాయమ్మని యాత్త్రకెళ్లమనీ పంపేడంట పున్నయ్యశాస్త్రుర్లంగారితోటిన్ని ఆయన భార్యాతోటిన్ని జతచేసి పంపాడంట.

జ్ఞాన - భర్తపంపుటగాదు. పరమేశ్వరుడే యామె నిచ్చటకు జేర్చెను.

శంభు - ఉండండి, ఉండండి, సక్కుబాయి మళ్లీలేస్తుంది.

సక్కు—(లేచి) వినదా, కలవైనదా. ఇన్నినాళ్లకా నీ సాన్నిధ్యభాగ్యము ననుగ్రహించితివి. వచ్చుచున్నాను స్వామీ, వచ్చుచున్నాను. శాశ్వతంబగు నీ సాన్నిధ్యభాగ్యముం గాంచవచ్చుచున్నాను. ఆహాహా, మందహాసభాసురంబగు నీ సుందర ముఖవిలాసము సహస్రమన్మథ సౌందర్యాతీతమై యెట్లు వెలిగిపోవుచున్నదో! శ్యామలాంగ! సహస్రభాస్కర బింబద్యుతి ప్రతిమానమై, దుర్నిరీక్ష్యమై, దురాలోక తేజో విరాజితమై, నీదేహకాంతి మణిచేజారములు నాకన్నులందెట్లు మిఱుమిట్లు గొలుపుచున్నవో! మోహనాంగా! రమ్మని కరమ్ములు నావంకను సాచి పిలుచుచున్నావా! అనుగ్రహించితివా! ఇన్నినాళ్ళకు నన్ననుగ్రహించితివా? ఇంతటి మహానందమును నాకెన్నడుం గల్గింపనైతివేమి? చిదానందస్వరూపా! చతుర్దశభువన సమ్మోహనముగా నిన్నినాళ్ళకు నీమురళీనినాదముచే నాశ్రవణరంధ్రంబులను పావనము చేయుచుంటివా మురళీకృష్ణా! ఓహో! ఏమయ్యాశ్చర్యంబ్రే! నీతాండవ కేళీవిలాసము, శరీరపాదమస్తకమును జలదరించి, రోమాంచితంబగుచున్నదే. చంద్రభాగా నిర్ఝరీవేగ సదృశంబైనా కన్నుల నానందరసము ప్రవహించిపోవుచున్నదే ఓహోహో! అదియేమి? అదియేమి? లోకాతీతమై ప్రళయార్క బింబముబోలె నీ యాకృతి విశ్వావతారము దాల్చి ప్రకృతియంతటను నిండి నిబిడీకృతమగుచున్నదే! ఈ మహాతేజము నన్నాక్రమించి నీ పావనమూర్తియందు విలీనము గావించుకొనునా? అలదే! ఏకాదశరుద్రులీ తేజమునందు మునిగిపోవుచున్నారు, అనంతకోటి విధాతలీ తేజమునం దణగిపోవుచున్నారు. ద్వాదశార్కులీ తేజమున దారులు వెదుకొనుచున్నారు. సురాసుర యక్ష గరుడ గంధర్వాది వియచ్చరసంతానమంతయు నీదివ్యతేజశ్శిఖలందు తేలియాడుచున్నారు. అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు, కరంబులుమోడ్చి భక్తియుక్తులై ప్రార్థనలు చేయుచున్నారు. గంధర్వులు కాహళాది వాద్యములను మ్రోయించుచున్నారు. విద్యాధరులు కల్పకపారిజాతాది సుమనస్సందోహమును, వేనవేలుగా గుమ్మరించుచున్నారు అన్నింటిమించి యతీతమై యాలోకనానందప్రదమై నీ గంభీరకాంతిప్రభ యింకను పైపై నాక్రమించి నన్ను ముంచివేయుచున్నది. ఓహో! ఎంతకాంతి! ఎంతటి మహాతేజస్సుపుంజము! రక్షింపుము స్వామీ! రక్షింపుము! ఈతేజముంగాంచి భరింపజాలకున్నాను.

సీ. అలముచున్నది దిక్కులన్నింటనిండి, మ
హోద్దండ మాయావిముక్త కాంతి
ధ్వనియించుచున్నది; దశకోటి కాహళ
దుందుభివ్రజని యుద్ఘోషణంబు
జ్వలియించుచున్నది; బ్రహ్మాండదాహక
మోహాగ్ని రంగని మూర్తియందు
కాన్పించుచున్నది; గంభీరమై లోక
భీకరాకాంతమహా విశ్వమూర్తి

ప్రకటమగుచున్నదీ కర్ణపర్వమైన,
ధీరమధుర మధురమురళీరవంబు
పిలుచుచున్నాఁడు నన్నదే విశ్వమూర్తి
రమ్యకైవల్య సేవకు రమ్మటంచు. ౫౦

రంగా! రంగా! రంగా!

(నేలపైఁబడి ప్రాణములు విడుచుచున్నది)

(గొప్పకాంతితో సక్కుబాయిశరీరమునుండి ప్రాణి లేచి రంగనిలో నైక్యమగును.)

(అందరును సంభ్రమముతో సమీపింతురు.)

జ్ఞాన—ఓహో! ఇదియేమి పరమాద్భుతము.

గీ. అక్కటిల్లి వేయి విద్యుత్స్ఫురీచుల
కాంతియొక్కచోటఁ గలసినట్లు
భక్తియిలు సక్కుబాయి దేహమునుండి
దివ్యకాంతి దేవదేవు జేరె ౫౧

పెద్ది—అయ్యబాబో! ఇదేంటయ్యో శాత్తుర్లంగారూ! నేను బతికుండానా సచ్చానా? వోలత్తవ్వముండో య్! నీ చదువంనోట్లో మన్నుపడ! నీనోట్లో దుమ్ముబడ! నాపేణంమీఁది కొచ్చిందేమేయ్! పాడుముండ!

శంభు—సెట్టి! ఏమిటా చిరాకు! మేమంతా బ్రతికుండగా నీ ప్రాణంమీఁదికేమొచ్చింది? అట్లా గట్టిగా కళ్ళుమూసుకున్నావే? కళ్ళుదెరువు—

పెద్ది – కళ్ళుదెరవొచ్చునా?- ఇందాకొచ్చిన యెలుగంతా పోయిందా?-

శంభు—వెలుగూలేదు చాలేదు. ముద్దులాగ మాట్లాడుతూ బ్రతికున్నానా అని అడుగుతావేమి? - కళ్ళుదెరువు భయంలేదులే!

పెద్ది – ఏమోబాబూ! కొంపను జే.దామయ్యా అంటే బ్రహ్మోత్సవమనీ, పాడనీ నన్ను పోనిచ్చావుగావు నువ్వు కదిలావుగావు. పేణాలతో కొంపజేరి పెళ్ళాం, బిడ్డల్ని చూచేయోగముందో లేదో!

శంభు – మరేంభయములేదులే! నోరేళ్ళూ కాకిలాగ బతుకుతావు.

జ్ఞాన—భక్తులారా! మనసక్కుబాయి, పవిత్రాత్మ పాండురంగనియందైక్యమైపోయినది! ఆహాహా! భగవంతుని సందర్శనమునకై యహోరాత్రములు కలువరించి భగవన్మాయచే పండరీపురముంజేరి తుదకు భగవత్సన్నిధానమున్నదె ప్రాణోత్క్రమణభాగ్యముం గాంచిన భక్తశిరోరత్నమగు సక్కుబాయకన్న ధన్యాత్ములు గలరా?

ఉ. ఏమితపంబు జేసెనో కో! యీగతి రంగని దివ్యసన్నిధిన్
స్వామి, నిజాత్మయందుఁ దన ప్రాణము లీనమిసేయుభాగ్య మీ
కామినిగాంచ గల్గుటకు - కర్మఫలాంతమునందుఁగ క—యీ
భూమినిఁ బ్రాణికోటి కనుభూతముగావు పురాకృతార్థముల్. ౫౨

ఎక్కడి యగ్రహారము! ఎక్కడి పండరిపురము! భక్తసూన్యమగు వత్తగాలేమి? పండరినాథుని బ్రహ్మోత్సవమున కీమె నంపుటేమి? వచ్చియామె పాండురంగ చరణారవింద సన్నిధానములం బ్రాణములను విడుచుటయేమి?—భగవచ్చరిత్ర మింతకన్న గలదా.

పెద్ది - ఏంటి! ఏంటి. - సక్కుబాయమ్మ సచ్చిపోయిందా. నిజంగానేక నిజంగానే.

శంభు—జ్ఞానయోగీంద్రా! నిజముగా నీమె మరణించినదా.

జ్ఞాన - అయ్యా! ఆశ్చర్యమేమి. చూడుఁడు.

గీ. అగ్రహారమునందున్న యప్పుడీమె,
యాత్మ శ్రీరంగ సందర్శనాభిలాష—
నెంతగా గొట్టుకొనియెనో యెఱుగరయ్య!—
ఈ సతినిఁ గర్మసూత్ర మిట్లీడ్చె తుదకు— ౫౩

పెద్ది—ఎంతపుణ్యాత్మురా లెంతపుణ్యాత్మురాలు! మాట్లాడతా మాట్లాడ తానే, మరణించిందయ్యా! ఇందుకేకామోసు మంచోళ్లసంగతి మరణకాలానగాని తెలియదంటారు! పాసిష్టాణ్ని - పండరీపురాన నాకై నాసావొచ్చింది గాదు.

జ్ఞాన— భక్తులారా! ఈ మహాభక్తురాలు పాండురంగని సన్నిధానము దివ్యులుమెచ్చదగిన మరణము నొందినది. ఈమెకొఱకై మనము బ్రహ్మానందము నందదగినదే కాని, యొంతమాత్రమును విచారింపరాదు! ఈమె పవిత్రదేహమునకు పుష్పాలంకార మొనరించి, దహనానంతరముననే బ్రహ్మోత్సవము నిర్వర్తింతము. ఈమె దహన విధికై మీరందరును మీమీ సమర్థతలకుదగిన చందమున ద్రవ్యము ననుగ్రహింప వేడుచున్నాను. మఱియునీమె పవిత్రమైన బ్రాహ్మణవంశమున జన్మించిన మహాభక్తురాలు, కావున నిచ్చటంగల పవిత్ర బ్రాహ్మణోత్తము లందరును సక్కుబాయి కళేబరమునకు బ్రహ్మరథము బట్టవలయును. ఇంతేకాక నో పుణ్యాత్ములారా!

సీ. మేలైన పట్టుదుకూలంబులం దెచ్చి—
మృతదేహము నలంకరింపవలయు—
మల్లెమొల్లలును, చామంతి జపాపుష్ప
సంచరియంబుల నలయు - చవలం

చందనాగరు కాష్ఠసంచయాదికమును
చితిపైనఁ బేర్పింపఁ జేయవలయు
అనుకూలమైనన్ని యాజ్యఘటంబులఁ
జేర్పించి యాహుతి సేయవలయు
బ్రాహ్మణులు బ్రహ్మరథమును బట్టవలయు
వేదఘోషలతో వాద్య వితతితోడ,
పాండురంగని కీర్తించు భజనతోడ,
సక్కుబాయికి చితిగతి సలుపవలయు— ౨౮

భక్త—జ్ఞానయోగీంద్రుల నిర్వచన మవశ్యాచరణీయము. ఇందులకు మేమంద రమును మనఃపూర్వకముగా నామోదించుచున్నాము.

జ్ఞాన—భక్తులారా! మీ యామోదమునకు పాండురంగమూర్తి బ్రహ్మానందము నంది తాండవకేళి సల్పుచున్నాఁడు! ప్రపంచకము ధనమూలమైనదగుట మీరందఱు నెఱిఁగిన విషయమే కావున శక్త్యానుసారముగా చందాలననుగ్రహింపఁ బ్రార్థించు చున్నాను.

పెద్ది—ఓస్! సందాలేటయ్యా! సందాలు-ఈపాటివ్వారానికి చందాలేయించా లంటయ్యా! బాగ్గం - సక్కుబాయమ్మకోసం ఎంత లెక్కయినాసరే నేనొక్కన్నే దాకలుజేత్తాను. కదనదపండయ్యా.

జ్ఞాన—ఓహో! ఇదియును పాండురంగని మహిమయే కాఁబోలును. భక్తులారా, మీ కందఱకును ధనసేకరణసేయు శ్రమగూడ తప్పిపోయినది — సక్కుబాయి గారిమపువాఁడే యగు పెద్దిశెట్టియను భక్తుండు దహనసంస్కారమునకగుధనమంతయు నిచ్చెద ననుచున్నాఁడు.

అందరు - జయా! పెద్దిసెట్టికి జయా - సక్కుబాయికిజయా - పాండురంగ విఠలునకు జయా.

జ్ఞాన—భక్తులారా, ఒక్కమారు మనమందరమును సక్కుబాయిపవిత్రాత్మకు సంతోషకరముగా పాండురంగసంకీర్తనముఁ గావింతమురండు.

అందరు—భజనచేయుదురు.

(అనుబంధము 9)

8 వ రంగము—పండరిపురము. (తెర)

ప్రవేశము—నారదుడు.

(అనుబంధము 10)

నార—ఆహాహా, లీలామానుష విగ్రహుండగు శ్రీపాండురంగని చరిత్రములు పరమాద్భుతములుగదా!

ఉ. ఎక్కడియగ్రహారమది యెక్కడి బ్రాహ్మణ మందిరంబు, తా
నక్కడ సక్కుబాయికొరకై—సున్నపురూపునఁ గృష్ణు డీగతిం
జిక్కుట యేమి? సక్కు తన జీవము లీపురి బాయుటేమి? తా
నక్కడ బంధముక్తుఁడయి, యీహరియీహరిజేరుటెట్లొకో. ౫౫.

భక్తులందరునుఁ జేరి యప్పుడే సక్కుబాయి భౌతిక దేహమునకగ్నిసంస్కారము గావించుచున్నారు. సక్కుబాయి శరీరము భూమిపైలేకుండ భస్మీభూతంబగు చుండల సక్కుబాయికి మారుగా మాయాసక్కుస్వరూపమున గాశీపతికి భార్యగా నటించుచున్న మాకృష్ణపరమాత్మకు శాశ్వతముగ నచ్చట నాజన్మాంత నిర్బంధదాస్యము తప్పదుగాఁబోలును. దైవమా! బ్రహ్మాండజాలములనెల్ల పోషింపఁ బ్రతిభగల్గి, నీ మాయాజాలంబునఁ బ్రకృతిని బంధించిన నీవు నేటి కొక బ్రాహ్మణ మందిరంబున దాస్యంబునఁ దగుల్కొంటివిగదా! భక్తసంరక్షణార్థమై నీ వెట్టిశ్రమలకైన నోర్చుచుంటివిగదా! స్వామీ!

గీ. పండరిపురంబువను సక్కుబాయితనువు
దహనమందుట నెఱుగవో దాసపోష
అచట నిర్బంధితోండ వెట్లైతివయ్య?
ఏ యుపాయంబుఁ దోఁపలేదే! మహాత్మ! ౫౬.

ఇందులకు నాచేతనైన యుక్తిగావించి, సక్కుబాయి భౌతికశరీరంబు దహింపఁబడకుండ ధాత్రీతలంబుని, నిల్పినంగాని, పాండురంగదేవునకు దాస్య విమోచనము కాఁజాలదు. ఈవార్తను రాధాదేవియు, రుకుమాబాయియు నింక నెఱుంగనట్లున్నారు. ముందుగా వారలకీ వృత్తాంతముం దెలియఁజేసి, పాండురంగదాస్య విమోచనోపాయంబును, వారితోడనే సంప్రదించెదగాక.

(అనుబంధము 1)

(నిష్క్రమించును.)

## 4 వ రంగము—పాండురంగ దేవాలయము

### ప్రవేశము—చదరంగమాడుచున్న రాధాబాయి, రుకుమాబాయి

రాధా – అమ్మాయీ! రుకుమా ఇదిగో! నాగుఱ్ఱమువచ్చి నీ మంత్రిపైనను రాజుపైనను, సమానముగా దూకినది. ఇప్పుడు నీవు రాజును రక్షించుకొనక తప్పదు, గావున, మంత్రిపై నాశవదలుకొనవలసినదే!

రుక్మి – ఓహో నిజముగా ప్రమాదము సంభవించినట్లున్నది.

[నారదుడు ప్రవేశము]

నార...అమ్మా! ప్రమాదమే సంభవించినట్లుండుటగాదు, ప్రబలమైన ప్రమాదమే సంభవించినది.

రాధా—ఓహో! మహాత్ములగు నారదమునీంద్రులు! అర్యా! నమస్కారము.

రుక్మి—మునీంద్రా! నమస్కారము. ఇందు దయచేయుడు............... మహాత్మా! ఇటుచూడుడు! మాయక్కరాధాదేవి, చదరంగమునందలి నా రాజును బంధించి మంత్రిని మ్రింగివేయ జూచుచున్నది.

నార—అమ్మా! నిజతత్వము నెరుంగమింజేసి, మీరిట్లు భావించు చున్నారు. కాని, నిజముగా నరికట్టింది మీయక్కగారుకాదు. అరికట్టబడినది మీ చదరంగపు రాజుగాదు

రుక్మి—అదియేమి మునీంద్రా! అట్లనుచున్నారు? ప్రత్యక్షముగ చదరంగపు బల్లపై నరికట్టబడిన నారాజు, కన్నులకు గాన్పించుచుండగా, కాదని పల్కెదరేమి?

నార—అయ్యో! వెర్రితల్లీ! పైబడుచున్న మహాప్రమాదస్థితి నెరుంగజాలక, మీరింకను చదరంగపు వెర్రిలోనే యున్నారా ?

రాధ— బ్రహ్మమానసపుత్రా! ప్రమాద మనుచున్నారేమి ?

నార—పిదప మనవి చేయుదును, కాని ముందీమాట చెప్పుడు. జగన్నాథు లెందున్నవారు?

రాధ—భక్తసంరక్షణ పరతంత్రులై - స్థలాంతరమున నున్నారు.

నార - ఎవరాభక్తులు - చెప్పగూడనివారా ?

రుక్మి - చెప్పగూడ కేమి ? సక్కుబాయి యను భక్తురాలు.

నార - అగ్రహార పురవాసినియే కదా !

రాధ - ఔ నామెయే !

నార - అట్లయినవారు శీఘ్రముగ మరలివత్తురా ?

రాధ - రాకేమి? ఆసక్కుబాయి బ్రహ్మోత్సవ దర్శనార్థమిప్పుడిచటికే వచ్చియున్నది. ఆమెకు మారుగా నాథుడాపురమున మాయా సక్కుబాయియై యుండ కలసి వచ్చెను. సక్కుబాయి మరలి యగ్రహారమున కరిగిన వెంటనే, స్వామియిటకు విచ్చేసెదరు.

నార - ఇప్పుడు సక్కుబాయి యెచ్చటనున్నదంటిరి ?

రుక్మి - ఇచ్చటనే.

నార - ఇచ్చటనే యున్నదా? బ్రతికియున్నదా? చచ్చియున్నదా?

రాధ - మునీంద్రా మీపలుకులు నేడు విపరీతముగ నున్నవియే !

నార - అమ్మా, చచ్చిన సక్కుబాయి యింక నగ్రహారంబున కరుగు టెక్కడ? స్వామికి దాస్యవిమోచన మగుట యెక్కడ ?

రుక్మి—ఏమేమి! నారదా! సక్కుబాయి మరణించెనా?

నార - నేటి యుదయమున - స్వామి చరణ సన్నిధానమున - అల్లవిగో ! గగనంబు నంటుచున్న యామంటలను దిలకించితిరా! అవి సక్కుబాయి చితాగ్ని కీలాజాలలు! చూడుడు.

సీ. ఉపవాసపరయు-భక్త్యుద్రేకయగు సక్కు-
జగదీశు దివ్యతేజమునఁ గలయ—
భక్తులందరును, తద్భౌతిక దేహంబు,
నెడఁగొని, యగ్నిసంస్కృతులు సేయ—
రూఢిగా సక్కూ స్వరూపభావన, శాశ్వ
తంబుగా భువిని లుప్తంబుగాఁగ,
విప్రమందిరమున వెలయు శ్రీనాథు, దా
స్యంబికజన్మదాస్యంబుగాఁగ,
పండరీపుర విభవంబు పాడువడును;
కాంతలు, తద్వీయు లందరు సంతసింత్రు;
అగ్రహారమె కైవల్యమై రహించు;
నింతకన్నఁ బ్రమాణ మింకేది? తల్లి! ౫౭

రాధ – అయ్యయ్యో! అట్లయిన నింకేది వెరవు? – అతురపడకున్న-నంతయును పాశనంబగు కాలమే దాపురించెనే! మునీంద్రా! ఇంకలను, ఉపాయాంతర మేమైనఁ గలదా?—

రుక్మి – కటకటా! ఎంతకష్టకాలము దాపుర మయ్యెను!

గీ. అక్కటా! యుత్సవముఁ గాంచి సక్కుబాయి
శీఘ్రముగ, స్వగృహముచేరు శ్రీనివాసుఁ
డింకవచ్చుననుచు నిరీక్షించుచున్న
యస్మదాదుల కేది, మార్గాంతరంబు? ౫౮

నార – సరి సరి సంగతి నెరిగించినయెడల, సముపాయ మెద్దియేని మీకైనఁ దోఁపకుండునా యని యాశించియున్న నన్నే యుపాయము నడుగుచున్నారా? తల్లీ! తమకన్న నీమాహాత్మ్యన కధికోపాయములు తెలియునా?

రాధ – పలుకఁదలచి యట్టె పలికెదవుగాక నీ వెరుంగని యుపాయంబులు మాకు దెలియునా? విచిత్రకలహ నిర్మాణవేత్తవగు నీ చరిత్రము చతుర్దశభువనవిఖ్యాతము గాదా! నారదా!

సీ. పారిజాతము నిచ్చి భామతో రుక్మిణీ
దేవికి కలహంబుఁ దెచ్చినావు—
గంగావతరణంబు గల్గిననాడు గం
గాగారులకు రాపొనర్చినావు—

పతిదానమును మిమ్ముఁ బన్ని ద్వారకలోన
మంచికల్లోలముఁ బెంచినావు—
కౌరవ పాండవ వీరుల నడుమ నె
న్నెన్నియో కలహముల్ బన్నినావు
తలఁప నేటికి కలహభోక్త యను పేర,
సార్థకాఖ్యను గంటివో సంయమీంద్ర!
ధాత్రిలో, నీవు లేని చరిత్రగలదె?
యుక్తులందు నిన్మీరు ధీయుక్తులెవరు? ౫౯

నార - అమ్మా! ఇది యంతయును నన్ను నుతించుటయా - నిందించుటయా?

రాధ - ఎట్లయిన నేమి? కలహాశన బిరుదాంకితుఁడవగు నిన్ను నిందించుటయు స్తుతించుటయే యగును గదా!

రుక్మి—అక్కా! ఈమాటలతో నేమి కాలాతీతమై పోవుచున్నది. సక్కుబాయి శరీరము దహింపఁబడక మున్నే చేయదగిన కార్యమేదియైన నున్నచో చేయవలయును గదా. నారదమునీంద్రా, ప్రమాదకరంబగు నీయుదంతము నాలకించినప్పటి నుండియును మా యిరువురి బుద్ధులును భ్రంశములైపోయినవి మాకింక నెట్టియోచనయుఁ దోపదు. స్వామికి దాస్యవిముక్తి ప్రసాదించు భారము నీయందేయున్నది.

నార - అమ్మా! అంతటి సన్మానమునకు మీదాసుఁడు పాత్రుఁడుఁ గాఁడు. కపటనాటకసూత్రధారియగు నాదేవదేవునకు దాస్యవిముక్తినిఁ గల్గింప, నల్పజ్ఞుఁడనగు నేనెంతవాఁడను. ఐనను మీరింతగా నడుగుచున్నారు గావున, నాకుఁదోచిన యుక్తి నాలకింపుఁడు.

ఆ. జ్వలనమూర్తి సక్కుబాయి నంటకమున్నె,
దివిజపురికి వైనతేయు నంపి
వరసుధారసంబు వర్షింపఁగాఁ జేయ
బడిన యెడల సక్కుబాయి బ్రతుకు. ౬౦.

రుక్మి... ఆ యుపాయముచేత సక్కుబాయిని మరల బ్రదికింపవచ్చునను కొందము. అంతమాత్రముననే ప్రయోజన మేమి? నాథునకు దాస్యవిముక్తి గలుగ వలదా.

రాధ - అమ్మాయీ, సక్కుబాయి మరల బ్రతుకునంతటి భాగ్యమేకల్గు నెడల నాథుని దాస్యవిమోచన కార్యమే పాటిది. నయంబుననో, భయంబుననో సక్కుబాయిని మరల స్వగృహంబున కంపఁగల్గుదుమేని, నాథుఁడు మనకు దక్కఁగలఁడు. నారద మునీంద్రా, ఇంతకన్న నుపాయాంతరము వేరొకటిలేదు. ఈ యుక్తియే ప్రశస్తమై యున్నది.

రుక్మి — అట్లయిన నిటి కాలయాపన మేల. గరుత్మంతుని బంపి కడమపని యంత యును మనము క్షణములో నిర్వహింతము. ఆపని మొదట చూడవలయును. రమ్ము —

( అందరు నిష్క్రమింతురు. )

( తెర )

---

5 వ రంగము— శ్మశానభూమి.

ప్రవేశము— } సక్కుబాయి శవము కాలుచుండగా భక్తులు భజనచేయుదురు.

కొంతసేపటికి మహావర్షము కురియును. అగ్ని చల్లారును. ఆకాశమున, అమృతభాండముతో గరుత్మంతుఁడు కాన్పించి అమృతము ను సక్కుబాయి కళేబరముపై వర్షించి వెడలిపోవును.)

సక్కు... [చితినుండిలేచి) రంగా, రంగా, పాండురంగా, ఎంతనిద్ర గల్గెను స్వామీ.

జ్ఞాన — అహాహా, ఏమి మన యదృష్టము పంచత్వమునందిన భక్తురాలు సక్కుబాయి, నిద్రలేచినభాతి పునర్జీవితయై చితినుండి లేచివచ్చుచున్నది.

అంద — జయా, శ్రీ సక్కుబాయికి జయా, జయా, శ్రీ పాండురంగవిఠల్ పరమాత్మకు జయా.

జ్ఞాన—సీ. అనలుఁ డీమె శరీరమును స్పృశింప నశక్తుఁ
డౌట, భీతిల్లి చల్లారెనేమొ—
భక్తలోకమును బావనముసేయఁగ భువి
కమరు లింకొకతూరి యంపిరేమొ!—
పాండురంగఁడు సక్కుబాయి లీలలఁదృప్తిఁ
జెందక బ్రతికింపఁ జేసెనేమొ!—
మనయదృష్టము మూర్తిఁగొని సక్కుబాయిగా,
నవనిపై నవతార మందెనేమొ

ఆ. కాకయున్న నిర్ఘనాకాశతలమున
కుంభవర్షధార గురియుటేమి
చితి గశించుటేమి సతి పునర్జీవియై
మనుటయేమి, విష్ణుమహిమగాక.

సక్కు—గురునాథా! నమస్కారము! ఇందేమి? నేను స్వప్నలోకమునందు న్నానా ప్రకృతిస్థనై యున్నానా ? ఈశ్మశానమునకు మన మందర మేల వచ్చితిమి? పాండురంగదేవుని యాలయమున గదా యుంటిమి?

జ్ఞాన—అమ్మా! నీవు స్వప్నలోకమునలేవు. ప్రకృతిస్థవేయై యున్నావు. మన మీశ్మశానమునకు వచ్చుటయు మరల నీతో గలసి యానందముతో, రంగని సన్నిధి గరుంగ గల్గుటయు—శ్రీపాండురంగని లీలలు !

గీ. పాండురంగని సన్నిధిఁ బరమపదము
నందినావమ్మరో! మహానందలీల—
కాని వెండియు నాశ్చర్యకరముగాగ,
బ్రదికి వచ్చితివమ్మ! మా భాగ్యవశత. ౬౨

సక్కు—అహా! ఎంతపని జరిగెను రంగా రంగా నీ దివ్యసన్నిధి భాగ్యము గాంచిన నాపై ననుగ్రహము మాని మరల నీపాపలోకముననే పడవేసితివా స్వామీ ! నాదుష్కర్మ మింకను పరిపక్వముంగాంచలేదా ?

జ్ఞాన—తల్లీ! జగన్మాతవై మహాభక్త శిరోభూషణమవై దూరీకృత పాప లేశవై పరమపవిత్రజన్మవై నిన్ను గాంచి పాపములే భీతిసంది పటాపంచలై పోవు ననిన నిక వానికి పరిపక్వదశ గలుగలేదనుట శశవిషాణమునకు వాడిమి తక్కువ యయ్యెననుటగదా? జగజ్జననీ! నీపై ననుగ్రహము లేకకాదు. మముబోటి పాపాత్ములనందఱ ననుగ్రహింపదలచియే మనలగన్న తండ్రియగు శ్రీ పాండురంగడు నీకు అనితరదుస్సాధ్యమగు నీ పునర్జన్మమును బ్రసాదించెను. ప్రకృతిభయంకరమగు నీ శ్మశాన భూమియందింక మనకేమియుఁ బనిలేదు. ఆనందముతో పాండురంగని సన్నిధానమున కరుగుదము రమ్మా. భక్తశ్రేష్ఠులారా! పాండురంగనామ-దివ్యసంకీర్తనముఁ గావించుచు, మనమింక నాలయమునకు భక్తవరాలగు సక్కుబాయింగొనిపోవుదమురండు.

(అనుబంధము 12)

(అందరు నిష్క్రమింతురు) (తెర)

## 6 వ రంగము—అరణ్యమార్గము.

ప్రవేశము—శంభుశాస్త్రి, పెద్దిసెట్టి.

పెద్ది—సెంభుశాత్తుర్లంగారూ ! సక్కుబాయమ్మ కాటికి అగ్గిముట్టించారా గండా! సావుగా అళ్లాడులుకుని చేతులుగడుక్కొచ్చినట్లేనా ?

శంభు—శవ్య యెదుట కాష్ఠంబేర్చి అగ్నిపాలుచేసిన తరువాత సంశేమున్నది పెద్దిసెట్టి?

పెద్ది—ఆదికాదయ్యా కాష్టాలదిబ్బ కాణ్ణంచిమనంరాంగనేఆకాశంబొక్కొడ్డట్టూ పెద్దవర్షం కురిసిందిగందా ? అగ్గారిపోయి సక్కుబాయమ్మ మళ్ళీ బతికిందేమోఅంటూ

శంభు—దీన్నే "దంపుడుకళ్ళ ఆశ" అంటారు. అగ్ని ఆరిపోతే ఆరిపోవచ్చు నేమో, చచ్చిన సక్కుబాయి బ్రతకట మెట్లాగోయ్.

పెద్ది—ఏంటోనయ్యా శాత్తుర్లూ! నాకిదంతా అగమ్యగోచరంగా వుంది. సక్కుబాయమ్మతల్లి సచ్చిందంటే నా కేమీ నమ్మకంలేదు. నిజంగా సచ్చిపోయిం దంటయ్యా, ఆయిల్లాలు.

శంభు—ఏమిటోయ్! పెద్దిసెట్టి. నిజంగానే అగమ్యగోచరపు మాటలాడు తున్నావు. మనస్సు చలించిందా ఏమిటి.

పెద్ది—మనస్సు చలించిందా అని అడుగుతుండావా శాత్తుర్లూ! అసలు మన స్సంటే యేంటి. మనస్సంటే ఆత్తమ. ఆత్తమంటే పరమాత్మ. పరమాత్మకూ ఆత్త మకూ బేదంలేదు. ఆతత్త్వం తెలియనోళ్ళు కొందరు ఆత్తమవేరే, పరమాత్తమవేరే అని వాగుతుండారు గానీ పెద్దిసెట్టి యేదాంతచాత్తరంలో రెండూ వొకటే. పెద్దిసెట్టి యేదాంతరమంటే యేంటో యిన్నావా. ఇనకుంటె చెపుతాను చెవులొగ్గియిను.

తత్త్వం

ఆత్తమంటే యేమిరా పరమాత్తమంటే యేమిరా
ఆత్తమకు పరమాత్తమకు అవంతబేదము లేదురా
అన్నమంటే యేమిరా మరి సున్నమంటే యేమిరా
అన్నమూ సున్నమూ గలిసితే అంత తెల్లనిదౌనురా
శివుడంటే యెవడురా కేశవుడంటే యెవడురా
శివుడు కేశవు లొక్కరూపై జీవలోకము నేలురా
అండమంటే యేమిరా బ్రహ్మాండమంటే యేమిరా
అండములు పిండములు మఱి బ్రహ్మాండములు హరిమాయరా
జీవులకు నందఱికి పెద్దిశెట్టి వేదాంతమురా
చావుబ్రతుకు లేనిదానిని సాగి యిక పోదమురా ॥ఆ॥     ౬-3

శంభు - గల్లాపెట్టి వదలిపెట్టి కవిత్వమెప్పుడు నేర్చుకున్నావు పెద్దిసెట్టి అర్ధజ్ఞానం అపాయకరమన్నారుసుమా! తప్పుడురాతలు రాసి శద్దినాలు పెట్టించేవు జాగ్రత్త!

పెద్ది - తప్పూ గిప్పూ నాకు తెలియదు, నోటెంబటొచ్చినదంతా కవిత్వమే. ఈ చేరిపానికీ రేగటిమన్నుకూ బేదంలేదు. రూపాయలకి సిల్లపెంకులకీ అంతకన్నా బేదం లేదు. పుట్టిననాడు కట్టుకొనిరాలేదు గిట్టినపాడు కట్టుకొపోయేదిలేదు.

పొమ్మేటప్పుడు వెంటరాదు వొక పుచ్చినగవ్వయినా! అన్నారు. యేమన్నా తాత గారి బోదలన్నీ యేదాంతాలే! ఎరగనోళ్ళుబూతుమాట లనుకుంటారు. తెలిసినోరికి తియ్యమామిడిపండు, తెలియనోరికి యిసముష్టిపండు. సక్కుబాయమ్మ సచ్చిపోయిందా

సేనోళ్ళు జాటాకోర్లు. యేదాంతపు తత్త్వం తెలియనోళ్ళ! సావేంటి బతుకేంటి. అంతా వొక్కటే.

1 మంటలో కాలేది మంటలో కలిసేది । మాయ దేహము మాత్ర
మేనోయి । సద్గురుడ । వేయేల । జీవాత్మ కాదోయ్ ॥మం॥
2 పుట్టునపుడెట్టులో ॥ గిట్టునపు డట్టులే । పోయేది దేహమే
నోయీ । సద్గురుడ । జీవాత్మ నిత్యమేనోయీ ॥మం॥
3 చుట్టాలు స్నేహితులు కాష్టానికే కాని । ఆపైన వెంటరారోయీ ।
సద్గురుడ । అవనిలో నెవరి కెవరోయీ ॥మం॥
4 భార్యలూ బిడ్డలూ । పశువులూ గృహములూ ! పాపిష్టిబంధనా
లోయీ । సద్గురుడ । యీజన్మతోనే సరోయీ ॥మం॥

శంభు—(స్వగతము) పిల్లికిపిడచైనా వేయనిపీనాసి పెద్దిసెట్టికి కొండంత వైరాగ్యమబ్బడం అక్షరాలైనా సరిగ్గా కూడబలుక్కో లేనివాడికి ఆకస్మాత్తుగా అనుధాశక్తిగల్గడం ఆశ్చర్యంగానే వున్నాయి. మనస్సేమో చలించి, కొంచెమించుమించుగా వైరధోరణిలో పడ్డట్టు తోస్తుంది. (ప్రకాశము) పెద్దిసెట్టి - హద్దూ ఆపూ లేకుండా యేక ఆశుధారకింద చదివేస్తున్నావు ఈకవిత్వమంతా ఎప్పుడు నేర్చుకున్నావు.

పెద్ది—నేరసుకోడ మేంటయ్యా ఎర్రిబాపడా! ఆమహాలక్ష్మి సక్కూబాయమ్మతల్లి యెదటనిలబడి చదివించేస్తుంటేను!

శంభు—సక్కూబాయమ్మ చదివించెయ్యడమేమిటి. ఎదట నిలబడిటమేమిటి? సక్కూబాయమ్మ చచ్చిపోయింది గాదటోయ్.

పెద్ది — సక్కూబాయమ్మ చచ్చిపోయిందంటే మూతిపళ్ళు రాలగొట్టేస్తాను. కళ్ళు లేనివెదవలకు చచ్చిపోయింది, మతిలేని సుంటలకి సచ్చిపోయింది, బుద్ధిలేని గాడిదెలకి సచ్చిపోయింది, ఆలోచనలేని అదోవాజెమ్మలకి సచ్చిపోయింది. మనలాంటి యేదాంతులకి సచ్చిపోవడమేంటయ్యా! అదుగో అదుగో సక్కూబాయమ్మ! నీకు కళ్ళున్నాయా కళ్ళుంటే కనపడుతుంది. నాయేలికినూటిగా ఆకాశంకాసి మాడు. రంగా రంగాఅని బజనజేత్తాంది. సక్కూబాయమ్మ. కాళ్ళకి గజ్జెలుకట్టుకొని తాండవిత్తాంది. సక్కూబాయమ్మ. పాండురింగస్వామికి పడిపడీ మొక్కుతూంది సక్కూబాయమ్మ. ఆతల్లి బజనలోగలసి మనంగూడా బజనసేతాం పాడవయ్యా బావనయ్యా పాటు. మన పాడు జలమలకి, ఇంతకన్నా మంచి సమయం దొరకుద్దా?

(తాళము వేయుచు పాడును.)

—♦ పా ట ♦—

రంగారంగా రంగారంగా యనవే మనసా!
రంగారంగా వైభోగుని కస్తురిరంగని సన్నిధిగనవే ॥రం॥
వేదవేద్యు (శ్రీ)రాధానాథుని పాదపద్మముల బడవే మనసా!
వాదములాడక వారిజనాభుని పావనకథ చెవి నిడవే ॥రంగా॥
అన్నియుతానై అన్నిటవేరై యున్న పరాత్పరు గనవే మనసా!
పన్నగశాయిని పలుమఱుఁదలచిన పాపము దొలగును మనసా ॥రంగా॥

శంభు— పెద్దిశెట్టి! ఏమిటా అల్లరి? నీకు పిచ్చిపట్టిందా. సక్కుబాయి భూతమై ఆవేసించిందా. భజనలోపడి అడుగవతల పెట్టకుండావున్నావే? ఎన్నడైనా యిట్లా ఎగుర్లుబెట్టావా? నడుత్వరగా యింటికి వెళదాం.

పెద్ది - (శంభుశాస్త్రిని వీపుపైఁ జరచి) బజనచెయ్యరా బాబూ అంటే యెర్రివేదాంతాలు సెపుతావేంట్రా బ్యాపనోడా! నాకుపిచ్చేంట్రా! పిచాచమంట్రా. ఎవడికిరా పిచ్చి. ఎవడికిరా పిచాచం నీకా నాకా? (తిరిగికొట్టును)

శంభు - అబ్బ నీయమ్మకడుపుకాల! పిచ్చిముండా కొడకా! ఎంతెంత చరుపులు చరిచావురా! పోనీగాని సక్కుబాయమ్మ తాలుకు మంగళసూత్రాలూ నగలూ జాగర్తగా వున్నాయా?

సెట్టి—ఓ! అతిజాగ్రత్తగా వున్నాయి. ఈ జీవాత్మ దేహంలో ఎంతజాగర్తగా వుందో అంతజాగర్తగా వున్నాయి.

శంభు—ఈపిచ్చిలో ఎక్కడైనా పారేస్తావు నాచేతికియ్యి, ఆవిడ యింట్లో యిస్తాలే.

సెట్టి—అమ్మా! బాపనోడికెంతాశ! నీచేతికిస్తే అమ్ముకొందామని సూత్తుండావా? ఎంత దురుబుద్ధీ.

శంభు—ఆవిడనగలు నే నమ్ముకుంటానా? నీమనస్సు తిన్నగాలేదు. పారేస్తావని అడుగుతున్నాను.

సెట్టి—వోస్ ! వల్లగాదు! సాయంగా నాసేతుల్తోవొట్టుకెల్లిసక్కుబాయమ్మ అత్తకిచ్చెయ్యాలె అంతే-మళ్లీ కిక్కురుమన్నావంటే మక్కెలిరగ మొట్టుతాను నడు.

శంభు—(స్వగతము) పిచ్చిముండాకొడుకు - నిజంగానే చంపేటట్టున్నాఁడు. వీఁడెక్కడ దాపరించాడురాబాబూ నాకు! (ప్రకా) పూఁ ఐతే పద.

సెట్టి - ఊరికేరొల్లటమా! బజన! బజన చేసుకుంటావెల్లాలె! పాడుబాపనోడా నాతోగూడపాడు - పాడాల్సిందే!

శంభు - బలవంతపు బ్రాహ్మణార్థంలాగుంది. ఊఁ - ఐతే నీశాస్త్రం ఏదో పాడుమరి!

సెట్టి - (పాడును.)

తత్త్వం

ఎందుకీ సంసారమూ? నిస్సారమూ ముందు వెనుక నపారమూ
ఎందుకీ సంసారబంధము గ్రహచార మిందలి మమకారమెందు
పారావార ॥ఎం॥

శంభు—(బలాత్కారముగా పాడుచుండును.)
పెద్ది—ఊరకే పాడటం కాదోయ్ ఎర్రిప్పా ఎయ్ తాళం ! (కొట్టును)
శంభు...నీముండామోయ! కొట్టటం మొదలుపెట్టావేమిరా !

(తాళము వేయుచు పాడును)

(తెర)

**7 వ రంగము—అగ్రహారమునందలి కాశీపతి యిల్లు.**

**ప్రవేశము—శయనమందిరమున కాశీపతితో మాయాసక్కుబాయి.**

కాశీ—నిజంగానా ?

సక్కూ - నిజంగావే. మీతోడు, వేనబద్ధమాడుటలేదు.

కాశీ - కాదు కాదు. సక్కూ! అబద్ధమే ఆడుతున్నావు. తప్పకుండా నీదగ్గర మందో మంత్రమో వుంది. లేకపోతే అమ్మ అమ్మ ! ఎటువంటి రాక్షసి ఎట్లా మారిపోయింది! మాఅమ్మంటే సామాన్యురాలా ? పూళ్ళోపువ్వు కరణాలూ, కాపులూగూడా అవిడనోటికి గడగడ లాడేవారు. వెధవకరణాలూ కాపులూ లెక్కేమిటి? దయ్యాలూ భూతాలూ సమేతూ ఝుడిసి పారిపోయేవి! అటువంటి మనిషి అతి విచిత్రంగా మారిపోయి "సక్కూ! నాసక్కుతల్లీ! సక్కుబాయమ్మతల్లీ!" అని పిలుస్తు ఇంటిపెత్తనమంతా నీ కప్పగించింది. భగవంతుడిపేరు వినబడితే భగ్గున మండిపడేమనిషి భారత భాగవతాలు వింటూ భక్తురాలైపోయింది. ఏదో మంత్రమో మందో ప్రయోగించి మా అమ్మను వశపరచుకున్నావు.

సీ. పాండురంగాయన్న మండిపోయెడి కాంత,
భక్తులతోఁగూడి పాడఁదొడఁగె,
పండరిపురికి నిన్నంపని గయ్యాళి
యాత్రలుసేయ నాయత్తమయ్యె
పిల్లి కెంగిలియైన బెట్టని శతలోభి
బీదల కన్నంబు బెట్టసాగె.
విగ్రహంబును బారవేసిన నాస్తిక
స్వగృహాన దేవతార్చనము నిలిపె.

భక్తిలేని మూఢ భాగవతాదుల
నాలకింప మిగుల నాశగోనియె
ఇంతలోన నింత వింతైన మారుపు
గలుగగలదె యిట్లు కారణముగ? ౬౨

సక్కు...నాథా! శ్రీవిఠలదేవుని కృపారస సంప్రాప్తి కతంబునబండులోడలు నోడలు బండ్లునగుట యొక ఆశ్చర్యమా? నిజముగా నాకు మందులును మంత్రములును తెలియుననియును అందువలననే అత్తగారిబుద్ధికీ పరివర్తనము గలిగెననియు దృఢముగా నమ్ముదురేని నిపుడు.

ఆ॥ మంత్రగత్తె నంచు మది విశ్వసింతురో
పాండురంగ మంత్రపఠన గలదు
మందు గలదటంచు మది నమ్మియుందురో
కలదు మంచిమందు తులసిదళము. ౬౩

ఏటులైననేమి? అత్తగారు భక్తురాలయ్యె అదియే మనకు మహాభాగ్యము. ఈవ్యర్థప్రసంగమునకేమిగాని పారాయణసమయమైనది. వారదుగో అత్తగారు! గీతాశాస్త్రశ్రవణ కుతూహలాయత్త చిత్తులై వచ్చుచున్నారు. (నిలువబడును)

(అత్త భగవద్గీతతో ప్రవేశము)

అత్త...శ్లేష్మంలోబడ్డ యీగవలె ఈ పాడుసంసారములో ఈదుకోగా యీదుకోగా, యిప్పటికి తెమిలి బయటపడ్డానుతల్లి! నిన్న చదివిన దగ్గరనుంచీ – భగవద్గీత చదువమ్మా సక్కూ!

సక్కు—చిత్తము (చదువును)

శ్లో. ప్రశాన్తమనసం హ్యేనం। యోగినం సుఖముత్తమం
ఉపైతి శాంతరజసం। బ్రహ్మభూత మకల్మషం॥ ౬౪

అర్థము—ఆత్మయందు హృదయమును చలనరహితముగా నుండుటచేత, సమస్త పాపములును ఉపశమింపగా, రజోగుణము శాంతినొంది, అందువలననే, శుద్ధాత్మరూపముతో నుండు నిర్యోగిని ఆత్మానుభవరూపంబైన యుత్తమసుఖమును గాంచును.

అత్త—అమ్మాయీ! సక్కూ! ఐతేనూ ఈశ్లోకాలన్నీ స్వయంగా శ్రీకృష్ణభగవాన్లనారు తమ నోటివెంట చెప్పినవేనా?

కాశీ—నోటివెంట చెప్పకపోడే కళ్ళవెంట చెపుతాడా? చెవులవెంట చెపుతాడా? అన్నీ పిచ్చిప్రశ్నలులేస్తావే మమ్మా?

అత్త—అదిగాదురా! కృష్ణభగవానులే చెప్పారా? కాకవారు చెప్పినట్లు మరెవరా కవీశ్వరు లెవ్వరైనా చెప్పారా అని అడుగుతున్నానురా!

సక్కు—అత్తగారూ! మరియొక కవీశ్వరులెవ్వరును చెప్పినవిగావు. శ్రీవిఠల్ భగవానులే, స్వయముగా అర్జునున కుపదేశించిన గీతామహావాక్యము లివి.

ఆ॥ జగమునందు గ్లాని సంభూతమగువేళ,
నొక్కొకరు మహాత్ము లుద్భవింతు;
ద్వాపరంబునం దుదయమంది—శ్రీకృష్ణ
మూర్తి—గీత లోకమునకుఁ దెల్పె. ౨౦

అత్త - ఓయబ్బా! ద్వాపరంనాడు చెప్పిన గీతలంటే యివ్వి? ఇంతకాలందాకా ఇవన్నీ, నాశనం గాకుండా, ఎట్లావున్నాయో!

పద్మ...ఆశ్చర్యమేమి? ఆకాల మీకాలమువంటిది కాదుగదా!

క॥ అప్పటి గురుకులవాసము
లప్పటి యావేదపఠన మప్పటి మేధ
స్సిప్పటికాలంబున వా
జప్పల కింతైనఁ దెలియనగునా కలిలోన్. ౨౧

కాశీ—నిజమేనే అమ్మా! అప్పటికాలంలో వేదం పద్యాలుగు పన్నాలూ, భుజాన జంద్యమున్న ప్రతివాడికీ వ్యాత్కావిలెగావుండేది. అప్పుడీ దిక్కుమాలిన తప్పులతడికెల అచ్చుకూటాలు, లేకపోవడంచేత ప్రతిగురువూ పరంపరంగా, శిష్యులకు నేర్పుతూవుండేవారు. వచ్చిన చదువు చచ్చినాపోకుండా ఊయిలాగ వుండిపోయేది. ఇప్పుడు, ఎంతఘనవిద్వాసుడైనా, అచ్చుపుస్తకాలుచూచి చదవడమే గాని, పునాది యేడిస్తేనా?

అత్త—మీనాయనగారూ ఆలాగే, నీకు వేదం చెప్పాలనీ, నిన్ను తనంత ఘనుణ్ని చెయ్యాలని, మహాశ్రమపడేవారు. ఐతే యేంలాభం? చదువుకోడానికి నిన్నెప్పుడు పిలిచినా కడుపునొప్పి-కాలునొప్పి అని వంకబెట్టి, గోలీకాయలో, గాలిపటాలో ఆడుకోటానికి వెళ్ళేవాడవు. తుదకొక్క అక్షరమైనా అబ్బిందేకాదు. ఇప్పుడుచూడుమరి! ఆఁడపిల్ల - అందులో భార్య ఎంచక్కా భగవద్గీతంతా చదివి చదువురాని మొద్దులకు మనకు వినిపిస్తోందో. నీకే నాలగక్షరాలు అబ్బివుంటే—ఎంతముచ్చటగా వుండేది! దీపంబెట్టి మొక్కుకోవాలె - ఆమహాను భావుఁడు మీనాన్నగారు. ఎంతకీర్తి సంపాదించారు...ఎంత విద్వాంసుఁడనిపించుకొన్నారు! ఎన్ని యజ్ఞాలుచేశారు! ఎన్నిదానాలుచేశారు... ఇంటిలో వెయ్యవిస్తరీ తియ్యవిస్తరీ...నిరతాన్నదానంగదా...ప్రాణాలు హరీ అనేదాకా, నీవు బాగుపడకపోతివే అన్న విచారమే కాని ఆయనకు మఱోహ విచారం వుండేదిగాదుగదా! ఇంతకూ ఎవరి కెంత ప్రాప్తమో అంతేగాని అధికం రమ్మంటే ఎలావస్తుంది. (కన్నీరునించును)

కాశీ—ఊరుకో! ఊరుకో—ఎందుకేడుస్తావులే? భావగొట్టి చెవులుపులిమి, నాలుగుముక్కలుచెబితే, నాకు చదువంటక పోయిందా?— నాకుబాగా జ్ఞాపకం నాయనగారు ఎప్పుడుచదువు చెప్పొచ్చినా నువ్వేవాదానవు దాపరించి నన్ను గారాబంజేసి, ఒక్కఅక్షరమైనా అంటనిచ్చేదానవుగాదు. చేసుకున్నదాని కిప్పుడే డుస్తున్నావు, ఎవరి నంటావు?

అత్త—పోనీలేరా నాయనా! అన్నితప్పులూ నావే! ఈ సోది మన కెప్పుడూ వుండేదేగాని, ఏదమ్మా సక్కూ! ఇంకో శ్లోకం ?

సక్కూ—(చదువును)

శ్లో. ఏవం యుఞ్జన్ సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే. ౨౮

అర్థము—ఈవిధమైన యోగియగు నాతఁడు ఆత్మయోగాభ్యాసముచేతనే అన్నివిధములగు పాపక్కలుషములను పోగొట్టుకొని, బ్రహ్మానుభవ కృతిగల్గి-అత్యంతమగు సుఖమును, నిరంతరమును అనుభవించుచుండును.

కాశీ—సక్కూ! ఈవేళ నాకేమో అమిత దాహమవుతుంది. చల్లని మంచినీళ్ళు తెచ్చిపెట్టుము.

సక్కు—భాగ్యము. (ముందుకువచ్చి స్వగతము] సక్కుబాయి పండరిపురమున మరణించినవార్త నెరింగిన; నాభక్తులిచటకు వచ్చుచున్నారు. ఇంక నేనిటనుండరాదు. అందులకే యీబ్రాహ్మణునకిప్పుడు నేను మృషాదాహ కల్పనముఁజేసితిని. ఈక్షణమే నాదాస్యమున కంతము.

ఆ. భక్తురాలి గాన బ్రాహ్మణ దారనై
దాసినై చరించి దాస్యకర్మ
సలుపఁ బాలుపడితి, సరియయ్యె నేటితో
సక్కుబాయి యాత్ర సాధువయ్యె. 23

[నిష్క్ర]

(శంభుశాస్త్రి—పెద్దిసెట్టి ప్రవేశము)

తత్వం

పెద్ది—కల్లలే చుట్టాలు కట్టెలే బంధువులు! కన్నతల్లెవ్వరే చిలుకా!
నిన్ను మోసేదు నలుగురూ వెంబడీ పదిమంది వెంట నెవరూ
రారు చిలుకా, ఊరికీ ఉత్తరాన సమాధి పురములో కల్లు యి
ల్లున్నదే చిలుకా, ఉసురు లుండేదాక వూరికే మూగేరు
కడకు తొలగొత్తురే చిలుకా. ॥౪॥

అత్త - ఏమిటీ అపశకునం పాట ?

కాశీ—ఎమిటోయ్! పెద్దిసెట్టి! యాత్రకెళ్ళిన తరువాత వేదాంతం నేర్చుకున్నావా యేమిటి

పెద్ది—అంతమయ్యేటప్పుడు పట్టుపడేది వేదాంతం. చిలుక దేహంలో ఆడేదాకా జీవుడు సంసారములో దాగుడుమూత లాడుతాఁడు. ఆపైన జీవుడూ దేవుడూ వొకాటే. జీవుడంటే దేముఁడు - దేముడంటే కాముఁడు - కాముఁడంటే రాముడు.

రామఁడు భీముఁడు - జీవుఁడు, దేముఁడు. కాముడు, రాముఁడు - భీముఁడు - భీముడో యీ భీముఁడు.

అత్త—అయ్యో! అయ్యో! పెద్దిసెట్టికి పిచ్చెత్తిందికామాలున్నురా పాపం!

శంభు—నిజంగా పిచ్చేనండి పాపం. పండరిపురంలో సక్కూబాయమ్మ మరణించడం మొదలు - ఇదేవిధంగా పిచ్చిపిచ్చిపాటలు పాడుతున్నాఁడు నా-యేము కలం చూర్ణమయ్యేటట్లు చావగొడుతున్నాడు.

కాశీ—ఆ! ఆ! నీకూ పిచ్చిపట్టినట్టే వుంది యీతిరిగెళ్లి ఇద్దరూ పిచ్చి వాళ్లయి వచ్చారు? అయ్యో ప్రారబ్ధమా!

శంభు - నాకు పిచ్చిలేదు - వెఱ్ఱిలేదు బాగానేయున్నాను.

అత్త—పిచ్చికాకపోతే యేమిటయ్యా నీ పిండాకూడు! సక్కూబాయి చావడమేమిటి? అప్రాచ్యంగా నోటికెంత మాటొస్తే అంతమాటా ఆడటమేనా!— నిండింట్లో యీసారి అప్రాచ్యపు కూతలు కూసిమాఁడు ఏంజేస్తానో?

కాశీ—అది యే సక్కూబాయోనో అమ్మా! అడగందే ఆగ్రపడటమెందుకు? మనసక్కూని యెందుకంటాడూ! శంభుశాస్త్రిని మనమెఱఁగమా యేమిటి? అంత బుద్ధిహీనుఁడా?

శంభు-కాశీపతిగారూ! నన్ను వెఱ్ఱివాడ్కిందకట్టక, సావకాశంగాయీసారైనా నా నామాటలు అర్థం చేసుకోండి;

అత్త—ఇంతకూ ఏసక్కూబాయి చచ్చిందయ్యా!

శంభు - కోపపడకండమ్మా! పండరీపురములో పాండురంగస్వామి పాదపద్మాల సన్నిధిని మీసక్కూబాయే మరణించిందండీ!

అత్త - మాసక్కూబాయంటే నాకోఁడలు సక్కూబాయేనా?

శంభు — చిత్తం మీకోడలు సక్కూబాయమ్మే!

అత్త - కాశీ, పిచ్చిముండాకొడుకుల్ని ఇంటిలోనించివెళ్లగొట్టక, చూస్తావేమిరా!

కాశీ - ఏమిటయ్యా శంభుశాస్త్రుల్లూ! - పిచ్చికూతలుకూస్తూ చావులూ బ్రతుకులూ శాపనార్థాలు పెడుతూ, నాకు పిచ్చిలేదంటావెందుకూ!

శంభు - నాకేంపిచ్చండి? మీరుగూడా అట్లాగేఅంటారు!

అత - పిచ్చిగాకేమి యింకానూ; ఒక గడియకిందట నాకోఁడలు పుస్తకం చదువుతూ యిక్కడేవుండేను. పండరిపురాన చచ్చిందని వాగుతావేంటివి!

శంభు - (ఆశ్చర్యపడి) ఏమిటి? ఒక్క గడియకిందట, మీకోడలు పుస్తకం చదివిందా? ఏం విపరీతపుమాటలు.

పెద్ది - కొట్టూ! బ్యాపనోణ్ని కొట్టూ! - సక్కూబాయమ్మ చావలేదురా అంటే ఒక్కడైనా యిన్నాఁడా ఇప్పుడేనబగించు.

కాశీ - ఏమిటి గొడవంతా! వాఁడి మాటలేమిటో వీఁడిమాటలేమిటో - ఒకటీ అర్థంగాదు.

అత్త – అర్థంలేదు వాళ్ళ శ్రాద్ధంలేదు – పిచ్చిముండాకొడుకుల వాగుడుకు అర్థ మేమిటా? పోండి పిచ్చిముండాకొడుకుల్లారా! శనిగ్రహాల్లాగ మాకొంపకు చేరారేం?

శంభు – ఉపకారానికొస్తే అపకీర్తి వెంటపడ్డది. అమ్మా, మీరు తిట్లతో శాపనార్థాలతో వెళ్లగొట్టినన్నూళ్లేము. ఎట్లాగు వెళ్లిపోతాంగాని, మరణకాలములో మీ కోడలి తాలుకు మంగళసూత్రాలు ఆభరణాలు మాకు వశపర్చబడ్డవి. అన్యాయ్యంగా వాటిని మేముంచుకొనవలచలేము. మీవి మీరు ముట్టచూచుకోండి, వెంటనే మాదారిన మేము వెళతాం ఇవ్వవయ్యా పెద్దిసెట్టి!

పెద్ది – (నగలమూట తీసియిచ్చుచు) చచనూ:ం భవతి – చతాయు ప్రతి తిష్టతి – లాభాలే లాభాలు – గాశీపతి మళ్లా పెళ్లాడేమంటే – కానిదమ్మిడియినా ఖరుదులేదు. – కాశీసంచి పెతనమంటే పెద్దసావుకారు పెద్దిసెట్టిదే! సరిగ్గా సూసుకోండి, ఆనక అదిలే దిదిలే దంటారు,

గాశీ – అత— (ఆశ్చర్యముతో పరిశీలించుచుందురు.]

శంభు – అయ్యా! గాశీపతిగారూ! నన్ను పిచ్చివాణ్ని గారమించిమీతల్లిగారూ మీరూ అనరానిమాటలన్నారు. మీ భార్యాసక్కుబాయమ్మ పండరీపురికి వచ్చి. తన భక్తిచేతనూ—గానంచేతనూ భక్తులనందర్నీ తన్మయచిత్తుల్ని జేసి భక్తిపారవశ్యం చేత పాండురంగడి పాదాలదగ్గరే జీవితాలు వదిలింది. మళ్ళావైభవంగా దహనసంస్కారాలు చేశారు ఇదంతా ప్రత్యక్షంగా మాకళ్లతో చూచిన విషయంగాని, గాలివార్త గాదు. నీలివార్త గాదు. సక్కుబాయమ్మ మీయింట్లోనే యున్నదనీ – గడియ క్రిందట పుస్తకం చదివి వినిపించిందనీ మీరంటున్నారు! మీమాటలైనా అబద్ధాలై వుండాలె...మాకళ్లకు భ్రాంతైనా కలిగివుండాలె... రెండూ మాత్రంనిజం గాలేవు గదా! ఈ మహిమాయ నేమిటో నాకర్థంగాకుండావుంది. ఆమె ఆభరణాలు పండరిపురాన్నుంచి మోసుకొచ్చి భద్రంగా మీ కప్పగించిన పాపానికి తలవాచేలాగ బహుమానాలు మాత్రం దొరికినవి. అందుకే పెగాస్త గారపడవలసి వస్తూాకది, ఏది యెట్లావున్నా మీసొత్తుమీకు చేరింది, మాభారం తీరింది. ఇకమాకు సెలవిప్పిస్తే వెళతాం... రావోయ్ పెద్దిసెట్టి!

(ఇరువురు నిష్క్రమింతురు).

కాశీ—అమ్మా! ఈ వస్తువులు మన కోడలివి గావటే?

అత్త—సందేహ మేమిటి? కోడలివే!

కాశీ—కోడలి వొంటిమీద నగలున్నవే! ఇవి పండరీపురాన వీళ్ళ పరం కావడ మేమిటి? కోడలు చావడమేమిటి? శంభుశాస్త్రి మాటలు పిచ్చిమాటలందామా అంటే ఈనగల కేమనాలె? ఇప్పుడు గాదటమ్మా మంచినీళ్ళు తెమ్మంటే సక్కు లోపలికి వెళ్ళింది.

అత్త—లోపలింకా యేంచేస్తోందో? అమ్మాయీ! సక్కూ!— సక్కూబాయమ్మా (...పలకదేం కోపంరో కాశీ)

కాశీ—ఇదిగో! ఏంజేస్తున్నావు లోపల! ఒకసారిట్లా రా...ఏమేవ్! వినపడ్డంలేదూ!

అత్త - వినబడ్డంలేదు - కనబడ్డం లేదు - నేను లోపలి కెళ్లి చూస్తాస్తానుండు. ( నిష్క్రమించును )

కాశీ—ప్రత్యక్షంగా సక్కుచావడం - దహనం చేయడం చూచామని చెప్తున్నాడే శంభుశాస్త్రి మరొక సక్కు చస్తే మనసక్కు అనుకోడానికి అతడు చూస్నెరుగని వాడా-ఎరిగినా ఎటుక్కుపోయిన నగలు దెచ్చి యిస్తున్నాడే... ఏమిటబ్బా యీచిత్రం ?...సక్కు అక్కడ చచ్చిమాట నిజమైతే - ఇక్కడున్న సక్కు యెవరైనట్లు? దయ్యమా? భూతమా?

(అత్త పునః చేరిక ప్రవేశము)

అత్త—మనసక్కుమాయమై పోయిందిరో నాయనా కాశీ - ఇంకెక్కడి సక్కుబాయమ్మరో తండ్రి కొంప ముంచింది - ఇంకేముంది! ఈచీరమాత్రం చిలక్కొయ్యకి తగిలించింది. సక్కులేదు..- చట్టుబండలూ లేదు..

కాశీ - ఆఁ? ఆఁ? లేకుండపోవడమే? ఇంతసేపూ పుస్తకం జదివి లోపలికెళ్లింది. ఇంతలో యేమైపోతుందమ్మా? తిన్నగా చూశావా?

అత్త - అయ్యో అయ్యో యింకెక్కడ తిన్నగాఁ చూడనురా నాయనా! మన సక్కు మాయమైపోయిందిరా తండ్రీ మన నోళ్లలో మన్నుబోసిందిరా కాశీ!

కాశీ - ఏమిటీమాయ? మనసక్కు నిజంగానే చచ్చిందా యేమిటే అమ్మా?

అత్త - ఏమోరా నాయనా! అంతా అగమ్యగోచరంగా వుందిరా నాకు! అప్పుడు చావడమేమోగాని యిప్పుడు నిజంగా చచ్చిందిరా!

(నలుగురు పౌరులు ప్రవేశము)

1 పౌ—హాహా! ఎంత అదృష్టవంతుడవయ్యా! కాశీపతీ!

అత్త—అదృష్టమెక్కడిది తండ్రీ! మా సక్కుమాయమై చక్కాబోయింది. నాయనా!

2 పౌ...మాయమైందా? నిజంగా మాయమైందా!

కాశీ...నిజంగానే మాయమైనది శాస్తుర్లుగారూ! అది భగవద్గీత చదువుతూంటే మాఅమ్మనేను వింటున్నాము. ఇంతలో ఎక్కణ్నుంచొచ్చిందో నాకు మాయ దాహం పుట్టుకొచ్చినది, మంచినీళ్ళు తేవే అంటే లోపలి కెళ్లింది. అదే ఆఖరుచూపనుకోండి. ఇంతలో శంభుశాస్త్రి పెద్దిసెట్టి పండరీపురాన్నించి వచ్చావొచ్చారు. మీసక్కుబాయి పండరీపురంలో చచ్చిపోయిందని నగలమూట తెచ్చియిచ్చారు. ఇదేమి చిత్రంరా అని చూతుముగదా కట్టుకున్న చీరమాత్రం చిలక్కొయ్యకు తగిలించి వుంది. మాసక్కు కనబడదు.

2 పౌ...అందుకే అదృష్టవంతుడ వన్నాము. సక్కుబాయి మరణవార్త శంభుశాస్త్రి చెబితే మేమూ యిప్పుడే విన్నాం.

అత్త...ఐతే...ఈమాయ ఏమిటంటారు మీరు?

1 పౌ - ఇంకా ఏమిటని సందేహపడతా రెందుకు. అర్థం కావడములేదూ.

శా. అంధప్రక్రియ సక్కుబాయి నటు యాత్రార్థంబు పోనీకని
ర్బంధింపం గోరకొంటి వీవు; హరి తద్బంధంబు లూడ్చెన్ దయా
బంధుండై చనుదెంచి నీకు స్నుషయై-వర్తిల్లె-మీసక్కుతా
సంధించెన్ నిరవద్యమోక్షపదవిన్ సద్భక్తితో పండరిన్ ౨౮

3 పౌ - సెబాసు కాశీపతీ! మహాపతివ్రత భార్యగా లభించినందుకు యథో-చితంగా ఇహపరాలు రెంటా ధన్యుడవైనావు గదా!

గీ. మొదట సాధ్విని భార్యగాఁ బొందినావు,
పిదప పాండురంగఁడే నీకు సుదతియయ్యె;
ధన్యుడైనాఁడ విహపరోత్తారకముగ
అగ్రహారము పావనంబయ్యె నేడు. ౨౯

అత్త-ఐతేనూ శర్మగారూ! ఇన్నాళ్లనుంచీ మాకు సక్కుబాయమ్మ లాగు కనఁబడుతూవుండేది నిజంగా సక్కుబాయి కాదంటారా. సాక్షాత్తు రంగఁడేనా.

4 పౌ - ఇంకా సందేహమంటమ్మా తల్లీ, ఆ మాయ సక్కు స్వరూపం రంగఁడే కాకపోతే - కలలోనైనా భక్తి అంటే యేమిటో యెఱుగనిదానికి నీకు భగవద్భక్తి వినాలనే సద్బుద్ధి యెందుకు గల్గిందో, ఆలోచించు లేవూ. ఎటువంటిదానవు ఎటువంటిదానవుగా మారిపోయినావో - నీ మనస్సుకు నీకు తోఁచడం లేదఁటమ్మా.

కాశీ - ఆమాటమాత్రం నిజమేనే అమ్మా!

అత్త - పాండురంగడి చేత కోరంటికం చేయించుకున్నానని తలచుకుంటే నా శరీరమంతా చెమటలుపోసి వొణుకుపుడుతూందేమండి శర్మగారూ!

2 పౌ—అనగూడదుగాని భగవంతుడిచేత సేవ సేయించుకున్న నీ పాపానికి నిష్కృతివుందా.

1 పౌ - భగవానుఁడు గీతల్లో—"మమ మాయా దురత్యయా" అన్నాఁడు అది నేటికి మనకు అనుభవాని కొచ్చింది.

2 పౌ భగవంతుడి లీలలు అమూల్యాలు అగమ్యగోచరాలు. బ్రహ్మేంద్రాదు లంటివారే తెలుసుకోలేకపోతున్నారు. మన మెంతవాళ్ళము.

1పౌ - ఇంతకూ, భగవంతుఁడు మీపుణ్యవశముచేతనే, మీకు దర్శన స్పర్శన భాగ్యాలు కలిగించాఁడు. మే మంతా పాపాత్ములం,

కాశీ—శాస్త్రిగారూ, చివరకు మేమిప్పుడు చేయవలసిన కార్యమేమిటి. భగవంతుఁడిచేత సేవచేయించుకున్న పాపం...మాసక్కుబాయిని బాధపెట్టిన పాపం మాకు ఏవిధంగా తీరుతుంది. అనుగ్రహించి మాకేదో మీరొక కర్తవ్యం ఉపదేశించాలె!

1 పౌ కర్తవ్యాని కేముందయ్యా, కాశీపతి.

ఉ. పోయినసక్కు విష్ణుపదముం గనఁబోయెను ధన్యురాలె—మీ
రా యమతోడ నేగెడు మహత్తర భాగ్యముఁ గాంచరైతి ర
న్యాయముగా సతీతిలక నారడివెట్టి రమేశుబాస్య మా
ప్యాయముగాఁ సహించితిరి పండరికేగి తరింపుఁ డింకపై. ౭౬

మీతోఁగూడ మేమ నేకులము పండరికివచ్చి శ్రీ పాండురంగని సేవించి పాప పరిహారము గావించుకొనే ఊహతో నున్నాము. ఈ దినమే, మన ప్రయాణానికి చక్కని మహూర్తమున్నది. బయలుదేరండి.

కాశీ—చిత్తం—మాతో ఇంకా వచ్చేవారుంటే అందర్నీ సిద్ధంగావుంచమని చెప్పండి.

( అనుబంధము 13 )

[అందరు నిష్క్రమింతురు]

[ తెర ]

8 వ రంగము – పండరిపురమున పాండురంగ దేవాలయము.

ప్రవేశము:–భక్తిచే పరవశయైయున్న సక్కుబాయి, అత్తయు, కాశీపతియు, జ్ఞానయోగియు, అగ్రహారపు పౌరులు.

భక్తులందరు–[అనుబంధము 14] జయ్! భక్తసక్కుబాయికీ జయ్!

(సక్కుబాయిపై పుష్పవర్షముఁ గురిపింతురు.)

జ్ఞాన—అమ్మా సక్కుబాయీ!

సీ. అంటె యంటనిరీతి, నింట సంసారివై
భవపంకముఁ దరించితివి గదమ్మ!
ఒకవంక బాధల నొందుచున్నైన
రంగనిమీఁది భక్తి మానవు గదమ్మ
అత్త స్తంభమ్మున కణచి కట్టినఁగూడ
దివ్య యాత్రకు వచ్చితివి గదమ్మ!
పండరి పురమందు ప్రాణము ల్వాసియు
క్షితి పునర్జన్మఁ గాంచితి–గదమ్మ
ఇపుడు నీయత్తయును, భర్త–యిటకు వచ్చి
నారు; నీకృపఁ గోరుచున్నారు? తల్లీ!

విమల సద్భక్తి పారవశ్యమున నుండి,
కన్నులను విప్పి మముఁ గృపగాంచుమమ్మ. ౨౨

సక్కు— (కన్నులు విప్పి) ఓహో! ఏమి నాభాగ్యము! మహాత్ములగు జ్ఞాన యోగీంద్రులరారా? స్వామీ నమస్కారము!

జ్ఞాన - తల్లీ! అంతర్జ్ఞాన సమేతులమగు మా వృతు లందరికన్న వతీతవై ప్రకాశించుచున్న నీ నమస్సులు నందుకొను మే మనస్థాలమై యున్నాము. అదిగాక—

గీ. ఇతఁడు నీజీవి తేశ్వరుం డీమె నీకు
నత్తగారును; వీ రగ్రహార జనులు;
నీ మహాద్భుత కథవిని నిన్నుఁగాంచి
పావనత నంద నిచటికి వచ్చినారు. ౨౩

కావున నాకన్న ముఖ్యముగ వీరు నీకు మాననీయులు; కృపామతివై తొలుత వారి ననుగ్రహింపుము.

సక్కు-ఓహో! ఎంతప్రమాదము? (సంభ్రమముతో వారికి నమస్కరించుచు,) అత్తగారూ! అభాగ్యురాలగు మీ కోడలు సక్కుబాయి నమస్కరించు చున్నది. నాథా! దాసురాలి నమస్కారములు!

అత్త— (లేవనెత్తి) తల్లీ! నీవు నాకులపావనివి. నిన్నుఁ దెలియక యనేక బాధలు పెట్టాను. ఆపాపం నాకెన్ని జన్మాలకైనా తీరదు. మావంశము, ముయ్యేడు తరాలూ తరింపఁజేసిన భక్తశిఖామణివి. నేను వట్టి అజ్ఞానురాలిని. నాకు నీవు నమస్కరించగూడదు. నీపాదాలమీఁది ధూళిసోకితే నేను తరించిపోతాను. సక్కుబాయమ్మతల్లీ! నీకే నా నమస్కారాలు.

సక్కు—అత్తగారూ! కించిజ్ఞను అల్పవయస్కను-నగు నాకు మీరు నమస్కరించుట నాకు శ్రేయస్కారణ మగునా? మీరు పెద్దవారు నాకు సదా పూజ్యులు.

కాశీ—అయ్యా! జ్ఞానయోగీంద్రులవారూ! మేము పూజ్యులమైన మిమ్మల్ని మన్నింపదగ్గ అనేకభక్తుల్ని అజ్ఞానముచేత అనేకబాధలు పెట్టాము. అందుకు మాకే ఘోరనరకం ప్రాప్తిస్తుందో దేవుడే యెరుగును. ఆసంగతట్లా వుంచండి. మాసక్కుబాయి యీవూళ్లో పాండురంగడిసన్నిధిని మొదట చచ్చిపోయిందనీ, తరువాత బ్రతికిందనీ మీరంతా అంటున్నారు. ఇందరిమాట అబద్ధమనడానికి వీల్లే కుండావుంది. కాని, యింతకాలంనుంచీ మాసక్కుబాయి మా యింట్లో నేచక్కగా కాపరం చేస్తూంది. ఇందులోవున్న మాయాపిటో నిర్ధారణ చేయదగ్గవారు మీరు కాకపోతే ఇక్కడ జేరిన భక్తబృందము - వారూ కాకపోతే పాండురంగడు మేము అజ్ఞానులము!

జ్ఞాన... కాశీపతి మహాశయా! త్రిజగమునంగల మహాదృష్టవంతులలో నీవు మహాదృష్టవంతుఁడవు; ఏలనన—

ఆ. సక్కుబాయి, యిచట చచ్చి జీవించుట
కల్లగాదు—మీకు, కాంతయగుచు
పాండురంగమూర్తి వర్తిల్లె; మీయట్టి
భాగ్యశాలి యొకఁడు వసుధఁ గలఁడె? ౭౬

భక్తావన దీక్షాపరతంత్రుఁడగు పాండురంగ నాథుని దివ్యలీలా విలాసమే కాని, యిందన్యమగు మాయ యొద్దియునులేదు. మీరును మీజనయిత్రియు పూర్వజన్మమున మహాతపం బెద్దియో కావించినారు, కానిచో, నెంతవారికి జగన్నాథుని చేత దాస్యము చేయించుకొను మహాభాగ్యము గల్గును.

1 షా – నేను చెప్పుటలేదటయ్యా కాశీపతి! చివరకు నామాటే నిజమైంది.

జ్ఞాన – అమ్మా సక్కుబాయీ!

గీ. సాధ్వీరో! నీదుశ్రమలెల్ల సమసిపోయె
భక్తులం దగ్రగణ్యవై ప్రబలినావు:
అత్తగారు—భర్తయును—మోదాబ్ధిఁదేల,
నింట సంసారివై యుంట హితమునీకు. ౧౮

సక్కు – స్వామీ! అనతిక్రమణీయమగు తమ హితోపదేశము, నాకు సదా శిరోధార్యమైనదియే! ఐనను...

సీ. శ్రీరంగనాథుని సేవించినట్టి యీకనులతో, నన్యంబు గాంచనోప;
భువనాధినాథునిఁ బూజించినట్టి యీచేతుల నితరంబు సేయనోప;
పాండురంగని పాటఁబాడిన నాల్కతో నన్యవాక్యంబులనాడనోప;
రంగాలయమ్ముఁ జేరఁగ మరిగిన కాళ్ళు నన్యస్థలంబున కరుగనోప;
విఠలదేవు దాస్యమ్ముఁ గావించినట్టి
యీతనువుతోడ నితరమానేవ లోప;
రంగనియనుగ్రహమునకై...కొంగుసాచి
కడమ జీవితమిచట నే గడుపుదాన!.....

ఈ యపరాధమునకు నన్ను క్షమించవలయును.

అత్త—అమ్మాయీ! సక్కుబాయీ! నీవులేని ఆపాడుకొంపలో మాకుమాత్రమేముంది తల్లీ! నీతోపాటు మేముగూడా యిక్కడే వుంటాము అనుగ్రహించు!

కాశీ—జ్ఞానయోగీంద్రులవారూ! మాకుగూడాసంసారముమీదఁ విరక్తిపుట్టింది మాఅమ్మ చెప్పినట్లు మేమూ యిక్కడే వుంటాము.

[ పాండురంగమూర్తిప్రత్యక్షమగును. ]

పాం - భక్తశిరోరత్నమా ! సక్కుబాయీ ! పరమపూజ్యుఁడగు జ్ఞానయోగీంద్రుని యాజ్ఞను శిరసావహించి, నీవు నీయత్తగారి తోడను, భర్తగారి తోడను - స్వగృహంబున కరిగి నాపై భక్తిమానక సంసారిణివై - ఇహంబున - నైహిక సౌఖ్యంబులను, పరంబున పరమపదలాభంబును గాంతురుగాక ! అనన్య దుర్లంబగు నాదర్శనంబున మీయందరి పాపంబులును, పటాపంచలయ్యెను. సక్కూ ! నీవు కోరినయపుడు నేను, నీకు మీయగ్రహారబున సయితము, దర్శనమొసంగి, నీకానందముఁ గల్గించెదము. నాయాజ్ఞ నీ విప్పుడె యగ్రహారంబునకు నీ వారితో నరుగుము.

సక్కు—మహాభాగ్యము !

పాం—జ్ఞానయోగీంద్రా! మీకింకఁ గావలసినదేమి?

సక్కు - పురాణ పురుషా! యుష్మద్దివ్యసందర్శనమే-మాయభీష్టముల నన్నిటినీడేర్చెను. అయినను ఇట్లగుగాక !

గీ; పుడమి సాధ్వుల కిడుములు తొలఁగుఁ గాక
ఎల్లరును భక్తినీశు భజింతురి గాక!
యువని నస్పృశ్యతా దోషమణఁగుఁ గాక!
కవిత, జనసమాదరణంబుఁ గాంచుఁగాక!

పాం......తథాస్తు !

అందరు...మహాప్రసాదము, ధన్యాత్ముల మైతిమి. జయ్! శ్రీపాండురంగ విఠలదేవునకు జయ్ !

(అనుబంధము 1)

(తెర)

శ్రీ స తీ స క్కు బా యి నా ట క ము

పంచమాంకము; సర్వమును

సం పూ ర్ణ ము.



4 భక్తులు—అందఱు.

మోహన—తాళము

పాండురంగా విఠలే శత పాపవిభంగా విఠలే ॥శ్రీ పాం
భండనభీమా పావననామా ఖండితదానవ పటలే విఠలే ॥పాం॥
1. పన్నగతల్పా విఠలే ముని సన్నుతకల్పా విఠలే
కన్నడసేయకు మన్ననబాయకు కస్తూరీయుత నిటలే విఠలే ॥పాం॥
2. లోకనాయకా విఠలే దుర్లోకనాయకా విఠలే
ప్రాకటకరుణా పావనచరణా నేకవైరిహర చటులే విఠలే ॥పాం॥

5 జ్ఞానయోగి - శిష్యులు (అంతా రామమయం వలె)

అంతారంగమయం ఈజగ మంతారంగమయం
అంతులేని జగమందలి భూతము లంతరంగములు నఖిలదిగంతము అం॥
నరసురగరుడులు నానాజగములు నరవింద భవభవనామలుసాధులు అం॥
మశకంబాదిగ మదగజాంతమగు మహిజాతచరాచరలోకంబులు అం॥

కన్నడరాగం 6 సక్కుబాయి ఆదితాళం

బృందావనమును వదలి రావుగా నందకుమారా నవనీతచోరా బృం॥
ఇందు రాగనీకిది యొకదూరమ డెందము భారమ గరుడగమనీ బృం॥
1 సభలో ద్రౌపది చాలగ మొరలిడ సభయు మొసంగితి వదిమఱచి
తివా ఇభరాజును రక్షింపగ రయమున నేగినకథ నీ వేగతి
మఱచితో బృ॥
2 డింభకుడా సభా స్తంభమునందున నవతరింపుమని యార్తిని బిల్వగ
నంభోజభవా ద్యమరులుబొగడ సంభవమందవెసరగునరహరి బృ॥

7 కృష్ణుండు—(కంఠాభరణమట్టు)

హిండోల్ రాగం—జప్ తాల్

భక్తావనంబు ఫీ యుక్తాశయముగ్రై ముక్తియును కష్టాంత
మును గాంచె భక్తమణి భ॥
వ్యక్తిచేతనె దాస్యయుక్తుండనైతి నాశక్తిచేతనె భక్తియుక్తు
లనుగా జేసి ప్రాక్తనాఘంబులను బాపెదను వీరి కిక భక్తియుతమగు
సక్కుబాయి రూపకమందు. భక్తా॥

# అనుబంధము



## 1 జ్ఞానయోగి—శిష్యులు

మధ్యమావతి—త్రిపుటతాళం

పండరీపురవాస శ్రీశ పం। అండకోటి సృజించే దొరరారా పం।

1 నిండుగా నీ బొజ్జలో బ్రహ్మాండకోటి ధరించి పెంచి బండలో
మండూకములకు తిండిపెట్టు బ్రహ్మాండనాయక పం।

2 శివవిధాతృ సురేశులైనా సిద్ధసాధ్య నాగేశులైనా
నీ విలాస మహాద్భుతంబు నెఱుఁగలేరు పరేశ దురితనాశ పం।

## 2 జ్ఞానయోగి

మోహనరాగం - ఆదితాళం

రంగ రంగ ఖగరాజతురంగ ।ర। ధాంగహస్త దానవభంగా

1 దయాంతరంగ యుభయాంతరంగ విషయాప్రసంగ విమలసంగా।ర।

2 శ్రీనివాస ఖల దానవ నాశ యశేషభువన సంతతపోషా సురేశ
నాయక సుధా ప్రదాయక పరాపరాత్పర భవదూరా ।రంగ।

3 మంగళాంగ శ్రీరంగనివాస యసంగవిజయ శ్రీ లలితాంగా
గదాధరాచ్యుత విచారితాహిత పదాంబుజాంచిత భవగంగా।రంగ।

## 3 సక్కుబాయి

(హిందూస్థానీముఖారి – త్రితాల్ (జయాపరలోతోనే అనుమట్టు)
రంగా భవభంగా శ్రీరంగా ।రం।
మంగళరూపా మహితకలాపా ।రం।

మోహనమైన నీ మురళీనాదము ఆహా శ్రవణా నందము
సేయగ శ్రీహరి పాపపు కనులకు నీ మృదుదేహము గనుపడ
దేమి విచిత్రమో రం।

## 8 సక్కు-బాయి—భక్తులు.

మోహనరాగం—ఆదితాళం.

ధన్యులమైతిమిగా ఓంగా ।ధ।
ధన్యులమైతిమి తమదర్శనమున మాన్యత గాంచెను మా
చరితంబులు ।ధ।

బహుభవ సంపాదిత దురితంబులు పండరిపురమున భగ్నము
లయ్యెను ।ధ।

## 9 జ్ఞానయోగి—భక్తులు

[మానవసహాయకారీ మురారీ అను మట్టు]

ధన్యధన్యా! సాధ్వీలోకమాయీ
మాన్యగుణమాయీ శ్రీసక్కు-బాయి ।ధన్య।
శాశ్వతంబై నీయాత్మ కెంతో శాంతి
విశ్వంబునం గల్గునింతీ ।ధ

## 10 నారదుఁడు.

భూపాలరాగం—దాద్రా

కృష్ణకృష్ణా గోపాలబాలకృష్ణా ॥కృష్ణ
గోపాలబాలకృష్ణా గోవిందబాలకృష్ణా ॥కృ।
వేణులోలకృష్ణా సుగుణాలవాలకృష్ణా
శ్రీనివాసకృష్ణా బుధ మానపోషకృష్ణా ।ధ।

## 11 నారదుఁడు.

హిండోల్—ఆదితాళం.

నీ మహిమ తెలియంగదరమె నీరజ భవశంకరామరులకును ॥నీ॥
కామజనక పరమాణువు మొదలగు ఘనతర మేరుధరాధరముదనుక
భూమిగల్గుసకలభూతతతులను విశ్వమూర్తివై వెలుంగుచుండెదునీ॥
ఈమహిమతో నీదశావతారము లెల్లసృష్టిపరివర్తనమేకద
కామరూపివై జ్ఞానమూర్తివై సామగానలోలుఁడవై చెలగెదు

12 సక్కుబాయి, జ్ఞానయోగి, భక్తులు.

మధ్యమావతి - రాగం - ఆదితాళం

రంగారంగా రంగారంగా రంగారంగా యనుఁడీ
మంగళాంగు శ్రీ పండరిరంగని మదిలో దలచండీ  రం॥
1 పెద్దలమనుకొని విఱ్ఱవీగి నిరుపేదల బోరికొనకండీ
హద్దుమీరి యమకింకరులీడ్చెడు నప్పుడేడ్వబోకండీ  రం॥
2 పాడుబిరుదులకు భ్రమపడి నీచుల పదములను బడకండీ
మూడునాళ్ళముచ్చటయని తెలియక మోసగింపబడకండీ  రం॥

బిళహరి  13 కాశీపతి, అత్త, పౌరులు.  ఆదితాళము

పయినంబయి నేడే చనుదము శ్రీపండరిపురికల పాండురంగనిగన ।ప।
భయదంబగు నీభవజలరాశిని భక్తినౌక నావలకుఁ దరింతము ।ప।
స్వయముగ పూర్వానేక జన్మముల సలిపిన పాపవితానము
సమయఁగ, జయజయరంగాయని వినుతించుచు జన్మరహితమగు
సద్గతిఁ గాంచఁగ  ।ప।

14 సక్కుబాయితప్ప ఆ రంగమునందలి అందఱును

శ్రీరాగం—ఆదితాళం.

పరమసాధ్వీశిరోమణి సక్కుబాయి నెన్నఁగరమే  ॥ప॥
మరణముఁ గాంచియు, మహిమాన్వితయై
మరలఁ బునర్జన్మంబు నందెఁగా
ఈసాధ్వీమణి పదధూళిచే నెల్లజగంబులును
భాసమానముగ, పరమపావనత వర్ధిల్లెడు నికనూ  ॥పర॥

15 మంగళము.

మందరధర మంగళకర మంగళంబురా మారసుందరా శ్రీరమేశ
శ్రీవరా దాశభరణ దోషహరణ దాసవేశనాశ రాజరాజేశ్వరా
ఓపరాత్పరా శ్రీనివాస జగదీశా శ్రీరమానాయకా జగ
న్నాయక  ।మం॥

సంపూర్ణము.

